జ గ ద్గు రు

# శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామి

## శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు, కుర్తాళంవారి మహదాశీస్సులు

తమరు పంపిన యీ నెల "శ్రీవాణి" కూడా అందినది. ఇంతకాలం ఆలస్యమైనందులకు యింకొక రు. 400/- కలిపి మొత్తం రు. 1500/- డి. డి. పంపుతున్నాను. ఇంకొక రు. 1116/- నేను బాగుంటే వచ్చే సంవత్సరం ఇచ్చెదనని ఆనాడు సభలో చెప్పితినిగదా !. ప్రతి సంచిక కవరుపేజీ బ్రహ్మాండముగా ముద్రిస్తున్నారు. ఇది తమ హుందాతనమును ప్రదర్శిస్తున్నది. "యోగక్షేమం వహామ్యహమ్" అని ఈశ్వరార్పణ దృష్టితో వదలివేయటమే ! భారము భగవంతునిపై ఉంచటమే ! బాగున్నది.

"ప్రేమలేని మనిషికన్నా - ప్రాణమిచ్చే శునకమే మిన్న" తమరు వ్రాసితిరి (మార్చి సంచిక) బాగున్నది. దీనిని RESERVE - PRESERVE చేసుకొని, ప్రాధాన్యము యిచ్చి మరొక సంచికలో ప్రచురించవచ్చును. "రూపాయితో ఉద్యోగం" అన్నది కూడా బాగున్నది. అయితే కొన్ని పేజీలు తగ్గించి, ఖర్చు తగ్గించి చిరకాలము at least రెండు మూడు తరములు JOURNAL ప్రచారము చేయుటకు ప్రయత్నము చేయవచ్చును. పునాది చేయవచ్చును. ఆశ, ఆతురత, అందరిని మెప్పించుటకు, అన్ని JOURNALS కంటే మిన్నగా వుండుటకు చూపు సర్వదా పోవుచుండును. కోపగించవద్దు. స్వతంత్రం తీసుకొని వ్రాసితిని. ఇందు నారాయణస్మృతులు.

— శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామి

---

## కృతజ్ఞతలు

మహదాశీస్సులతోపాటు 'శ్రీవాణి'కి ఆర్థికసహకారం కూడా అందించినందులకు జగద్గురు శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామివారికి కృతజ్ఞతాభివందనలు.

— సం.

జులై - 1987

సంపుటి : 3

సంచిక : 7

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 3-00 |
| సంవత్సర చందా | : రు. | 36-00 |
| 2 సం॥ల చందా | : రు. | 66-00 |
| 4 సం॥ల చందా | : రు. | 116-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 500-00 |

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM

## విషయసూచిక



ముఖచిత్రం :

ఆదర్శ మాతృదేవి శ్రీ శారదామాత

# రాయలు వర్ణించిన వేసవి

ప్రబంధాలలో సాధారణంగా శృంగారం దానికి అనుగుణమైన వసంత ఋతు వర్ణనలు కనబడుతుంటాయి. మిగిలిన ఋతువుల సంగతి ఎలా వున్నా, అసూర్యం పశ్యలయిన, ప్రబంధ నాయికల జోలికి, గ్రీష్మఋతువు అసలేపోదు. కృష్ణదేవరాయలు ప్రకృతిని నిశితంగా పరిశీలించిన కవి. ఆముక్తమాల్యదలో ఈయన వేసవిని అద్భుతంగా వర్ణించాడు.

రాయలు వర్ణించిన వేసవి విశేషాలు ప్రకృతికే కాక, ప్రజా జీవనానికి కూడా, సంబంధించి వున్నాయి. ఎండిపోయిన నదులు - చలమలు - పడమటిగాలి హోరు - సుడిగాలి తీరు - చలివేంద్రాలు - రసిక జనుల ఆరాటం- శ్రామికుల జీవన పోరాటం - చక్కగా సహజంగా వర్ణించాడు రాయలు.

వేసవికాలం వచ్చినట్లు మనకు మొట్టమెదట స్ఫురింప జేసేవి ఎండమావులు. తరువాత బావులు. రాయల వేసవి వర్ణనం ఎండమావుల రాకతో, బూరుగకాయల ప్రేలుళ్ళతో మొదలయింది. బూరుగదూది, పింజలు గాలిలో తేలుతున్నాయి. అవి, సూర్యకిరణాలకు కాలి, పైకెగసిన వస్తువుల, బూడిద తెప్పల్లాగ వున్నాయంటాడు రాయలు.

క॥ తరణి ఖర కిరణ శిఖి జగ
మెరియింపగ, బొడమి, గాలి నెగసిన భసితో
త్కర మనగ శాల్మలీ తరు
పరిణత ఫలతూల మర్క పథమున కెగసెన్॥

రోహిణికార్తె వచ్చిందంటె, పడమటిగాలి మొదలవుతుంది. పచ్చటి చెట్లు కూడా మాడిపోతయి. రాయలు, పడమటి గాడ్పును వర్ణించటంలో, వాస్తవం కంటె, ఊహాలోకంలోనె ఎక్కువ విహరించాడు. సూర్యుడి రథ సారథి అనూరుడు. పగ్గాలు పాములు. అవి వేడిగా వున్న పడమటి గాలిని తినలేక నీరసించి నిముష నిముషానికి జారిపోతున్నాయిట. అనూరుడు వాటిని, తిరిగి తిరిగి ముడి పెట్టడంతో, సూర్యుని ప్రయాణం, ఆలస్యమయి పగలు పెరిగిపోయిందట. వేసవిలో పగటికాలం హెచ్చుగదా ! కవి దీన్ని ఇలా చమత్కరించాడన్నమాట.

"రథస్యైకంచక్రం, భుజగ యమితాః సప్తతురగా
నిరాలమ్బో మార్గ శ్చరణ, వికలః సారధి"

అన్న ప్రాచీన శ్లోకం రాయలవారి వూహకు మాతృక అయివుంటుంది.

పింగళి వెంకటకృష్ణారావు

సుడిగాలులు గుండ్రంగా తిరుగుతూ దుమ్ము రేపుతుంటె పది పదిహేను అడుగుల యెత్తుగల స్థూపాకారాలు దొర్లుతూ పోతున్నట్లు కనిపిస్తాయి. అవి వరుణదేవునితో మొరపెట్టుకోవటానికి పోయే యెండిన బావుల్లా వున్నాయట. నదులలో తీసిన చలమలు, నదీ కాంతలు ధరించిన ముత్యాల దండల్లాగా వున్నాయట. రాయలు పరిశీలనా దృష్టి, వూహ అద్భుతం.

అగాధాలైన చెరువులన్నీ యెండిపోయి, కొంగలకు మోకాలి వరకు వచ్చేంత మాత్రమే, నీళ్ళు కలిగి వున్నాయి. దాంతో చేపలకు, నత్తలకు, పీతలకు ప్రాణ సంకటం వచ్చింది. కొంగలకు మాత్రం చాలా సరదాగా వుంది. చెరువంతా తిరుగుతూ నత్తల్ని చేపల్ని తెగ తింటున్నాయి. ప్రాణానికి తెగించి ఒక ఎండ్రకాయ కొంగ కాలు పట్టుకుంది. పాపం ! కాని కాలంలో బలవంతుడి జోలికి పోయిన పేదవాడిలాగ అయింది, దాని పని. కొంచెం ఎగిరి అవతల వ్రాలి దాన్ని కాస్త పొడుచుక తిన్నది కొంగ. ఇలా వేసవి వింతలు రాయల కవితలో కొల్లలుగా కనిపిస్తాయి.

ప్రబంధాలలో, మల్లెలు సుందరుల ధమ్మిల్లాలలో, చిగురాకు తల్పాలపైన వుంటాయి. వెన్నెల నాయిక, చెక్కిళ్లపైన కన్పిస్తుంటుంది. కృష్ణరాయలు మల్లెలను, వెన్నెలను భిన్నంగా, చిత్రంగా వర్ణించాడు. ఎండకు కాలని మల్లెచెట్ల వంటిపై తేలిన బొబ్బలే మొగ్గలంటాడు.

" మెండు మీరిన పగటి బీ రెండ దాకి
యొల్ల బోయిన లే బొండు మల్లె పొదల
తుదల జప్పటలై కడు దొడ్డలగుచు
పొడమె మొగ్గల గము లగ్గి బొబ్బలట్లు "

ఎండలో పాటలు పాడుతూ, తోటలకు యేతాలు తొక్కి, నీళ్ళు కడుతున్న శ్రామికుల్ని కూడా ఈ ప్రభువు మరచిపోలేదు. మల్లెమొగ్గల వర్ణనలో, ఆయనకు శ్రామికుల పట్ల గల సానుభూతి తొంగిచూస్తుంది.

వెన్నెల వర్ణన మరీ విలక్షణంగా వుంది. భూమి పగలంతా కాలి, మాడిపోతున్న పెనం లాగ వుంది. రాత్రి పండు వెన్నెల, భూమి అనే పెనం పైన చకోరపు పిల్లల కోసం వేసిన పలచటి దోసెల్లాగా వుంది. ఇలాంటి ప్రత్యేకత కల వర్ణనలు రాయల కవితలో మనకెన్నో కనిపిస్తాయి.

చలివేంద్రాలు, నాటినుండి నేటిదాకా వేసవికాలం దర్శనమిచ్చే గ్రీష్మోపశమనాలు. ప్రభువులు, ధనికులు, ధార్మిక సంస్థలు, క్రొత్త తాటాకులతో పందిళ్ళు వేసి బాటసారులకోసం బానలతో నీళ్లు పెడతారు. ఈ రోజుల్లో మంచినీళ్ళు పొయ్యటానికి చిన్నపిల్లలో, ముసలివాళ్ళో మొత్తానికి యితరత్రా పనులకు ఉపయోగపడనివాళ్ళే, కనబడుతుంటారు.

రాయల కాలంలో చలివేంద్రాల నిర్వహణకు ప్రత్యేకమైన ఏర్పాట్లున్నట్లు కనపడుతుంది. చలివేంద్రాలలో సుందరాంగులు బాటసారులకు దాహశాంతి కలిగించటమే కాకుండా కండ్లకుకూడ విందు చేసేవాళ్ళు. చలివేంద్రపు సుందరులెలా వున్నారో చూడండి.

సెగ కుల్కి మరుగు జొచ్చిన జహ్ను రవిజల
సరణి మల్లెలతోడి జడలు మెరయ
వలచన్ను కొమరు, ప్రముచ్చిలిన దిమ్మను, తెరం
గున, ముంచు గరిగ, కాగుల మునుంగ
ధారలో దోచు, కన్దళుకులు, వాసితో
త్పల పత్ర పతన సంభ్రాంతి నొసగ
తెలమోము పస మెచ్చి, తలయూచు, పెరిగి మా
నక నవ్వు నేర్పు, దెందముల గరప
దెరవలిటు నీరు వోయు, పందిరియజేరి
యవల గొరగాక, పిచ్చుగుంపై యనంగు
డనుపు గొన జొచ్చె, గల్ల గుట్ట మరవారి
కధ్వగులు, లాచి యిడు విడియముల పేర

ఆ స్త్రీలు నల్లని జడలలో మల్లెల దండలు పెట్టుకున్నారు. అది చూస్తుంటే, ఎండకు భయపడి, నల్లగా వుండే యమున, తెల్లగా వుండే గంగ, వారిని ఆశ్రయించాయా అన్నట్లున్నది. వారు ముంతలతో, బానలతో నీళ్ళు ముంచుతూవుంటే – కుండలు దొంగిలించిన, తమ స్తన సౌందర్యాన్ని, తిరిగి బయటకు తీసుకుంటున్నారా అన్నట్లుంది. వారి చేతి, జల కలశాలు, కుచాలకు ఉపమానాలుగా వున్నాయి. బాటసారుల దోసిళ్ళలో, నారు నీరు పోస్తున్నారు. నీరు త్రాగబోతున్నవారిని, దోసిలిలో ప్రతిఫలిస్తున్న ఆ స్త్రీల సౌందర్యం కలవరపెడుతున్నది. కొంత శృంగార భావనకూడ కలుగుతున్నది. ఆ స్త్రీలు వీళ్ళ వ్యవహారం గ్రహించారు. దోసిలితో నీళ్ళు తాగే వాడు చాలన్నట్లుగా తల వూపుతాడు. బాటసారులు తల లూపుతున్నారు. అది తమ సౌందర్యానికి మెచ్చుకోలు, దాహం తీరి కాదని, ఆ పడుచులు నీరుపోయటం ఆపటం లేదు. ఇక్కడ ఒక కొంటెతనం వుంది. నీళ్ళు పోయటం ఆపకముందు, చేతులు తీస్తే, గుడ్డలమీద పడటమే కాకుండా బురదకూడా చిందుతుంది. బాటసారులను యేడిపించటానికే వారలా చేస్తున్నారు. వేసవికి సోలిపోయిన బాటసారులు మంచినీటితోపాటు ఆ సుందరుల

( తరువాయి 45వ పేజీలో )

శ్లో॥ హర్మ్యస్థాన మధర్మ కర్మ వితతేః, దుర్మార్గ ధర్మాసనం
శాస్త్రస్తోమ లలాట ఘూలిపిలయః, శాంతిః సవానామపి
ఆమ్నాయార్థ వచస్సమాపసదినం, సంస్థా సదర్గాపవిధేః
అర్థాశాజనిభూ రభూ దిహా మహానర్థావహోఽయం కలిః

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" అని సృష్టిలో సర్వ జగత్తు సుప్రతిష్ఠితమై నిలబడటానికి ప్రధాన కారణం ధర్మం. అలాంటి ధర్మం కలియుగంలో చాల పలచబడిపోవటం గమనించవలసిన విషయం. కలిలో ఒక్క పాదం మాత్రమే ధర్మాచరణం వుంటుంది. మిగిలినదంతా అనేక అనర్థాలతో కూడి వుంటుంది. ధర్మాన్ని ఆచరించాల్సినవాళ్ళు మానవులు, ప్రభుత్వము అప్పుడే అది ధర్మమవుతుంది.

# అమృతవాణి

వ్యాసి । శ్రీ

మానవులకు సామాన్య ధర్మాలు, విశేషధర్మాలు అనేవి వున్నాయి. సామాన్య ధర్మాల నాచరిస్తుంటే మానవత అనేది వున్నట్లు. విశేషధర్మాలు సంస్కారాన్ని పెంచి మానవులను ఉత్తమ పురుషులనుగా తీర్చి దిద్దుతాయి. అలాంటిది సామాన్య ధర్మ నిర్వహణకు కావలసిన కర్మల నాచరించక పోగా ధర్మ దూరమైన కర్మలు చేయటం ఈ కలిలో ఎక్కువగా వుంటుంది. అన్నివిధాల అధర్మ కర్మలకు పెద్ద భవనమట యీ కలియుగం.

దుష్టమైన వివిధ దురభిమానాలకు ఇది ధర్మాసనం లాంటిది. ధర్మ మాచరిస్తున్నట్లు పైకి వేషాలు వేసి దురభిమానాలతో ప్రవర్తించే దుర్యోధనులు విజృంభిస్తారు. మనకు అనేక విలువలుగల గొప్ప శాస్త్రాలున్నాయి. అవన్నీ మానవతను మహత్వపూర్ణం చేయటానికి అమూల్య విషయాలను బోధించాయి. జ్ఞానప్రబోధకాలయిన ఆ పలుకులు ఈ కలిలో వినేవారు కరువవుతారు. ఆ మాటలను తుడిచివేస్తారీ కలిలో మానవులు. ఇక విధి విహితాలయిన యజ్ఞ యాగాది క్రతువు లెలా జరుగుతాయి? వాటి తత్త్వం తెలీక విమర్శించే ప్రబుద్ధు లెక్కువవుతారు.

వేదాలు శాస్త్రాలు అంటూ మహోపన్యాసాలే మిగులుతాయి గాని వాటి పరమార్థాన్ని గ్రహించే వాళ్ళుండరీ కలిలో. గౌరవమున్నట్లు నటించి సంఘాన్ని మోసం చేస్తారేగాని ఆ వేద విహితమైన కర్మలనాచరించరు. వాటికి సమాధే యీ కలిలో జరిగేది.

పూజలు పురస్కారాలు వున్నాయనుకోండి. అవి క్రమ బద్ధంగా వుండవు. శ్రుతిస్మృతులు చెప్పినట్లు కాక ఎవరికి తోచినట్లు వాళ్ళు చేసుకొనేవిగా తయారవుతాయి. పైగా తుచ్ఛమైన కామ్య విషయాలను సాధించటానికి నీతి బాహ్యమైన పూజలుచేసి అధికారాదులకోసం ఆరాటపడే డంబాచారు లెక్కువవుతారని అర్థం. ఈ కలిలో ఏం చేసినా ధనార్జనకోసం చేసే పనులేగాని లోకం కోసం చేసేవి మాత్రంకావు. ప్రతివ్యక్తి ధనాశతోనే ప్రవర్తిస్తాడీకలిలో. లంచాలు, మామూళ్ళు అనేవి యిలాంటివే!

రామరాజ్యస్థాపన మేం చేస్తాం అని నాయకుల ప్రగల్భాలేగాని అందులో నిజం లేదు. రామరాజ్యం ఎలాంటిదో రామాయణం చదివితే తెలుస్తుంది. ఆ లక్షణాల్లో ఒక్కటీ మన ప్రభుత్వాల్లో మచ్చుకు కూడా కనబడదు. అలా చెప్పటం, దురాచారాలను చట్టాలతో నిబంధించటం, అధర్మాన్ని ధర్మంగా సూచించటం కూడా కలి ప్రభావమే.

★

శ్రీవాణి

# ఆదర్శ మాతృదేవి శ్రీ శారదామాత

మహాత్ముల చరిత్రలు ఉదాత్త భావగర్భితములు-జగత్కల్యాణ హేతు భూతములు కొందరు మహనీయులు సమాజ హితమును కోరి, సమాజ సంక్షేమం కోసం తమ జీవితాలను అత్యంత ఆదర్శప్రాయంగా గడుపుతూ, స్వసుఖాలను త్యజించి, పరోపకారార్థం జీవిస్తారు. మహోత్కృష్టమైన ఆశయ ఆదర్శములతో తాము జీవిస్తూ, తమ అనుచరులను మంచి మార్గాన నడిపిస్తుంటారు. ఈ మహత్తర ఆశయ సాధనలో తాము ఆహుతి అయిపోతున్నామని తెలిసినప్పటికీ, ఏ మాత్రం వెనుకంజవేయక నిరంతరం పోరాటం కొనసాగిస్తూ కన్నుమూస్తారు. అటువంటి మహనీయుల చరిత్రలు దివ్య చరిత్రలు. మానవాళి వున్నంతకాలం అట్టివారిని ఆరాధిస్తూనే ఉంటారు, పూజిస్తూనే ఉంటారు. వారి ఉపదేశాలను స్మరిస్తూ, స్ఫూర్తిని పొందుతూ ఆచరిస్తూనే ఉంటారు. అటువంటి మహనీయులు మనకు కనిపించక పోయినా, వారందించిన స్ఫూర్తి మాత్రం మనల్ని నడిపిస్తూనే ఉంటుంది. సమాజంలో అశాంతి చెలరేగినప్పుడు మనశ్శాంతి కొరవడినప్పుడు ; ధర్మానికి హాని సంభవించినప్పుడు , అధర్మం విశృంఖలంగా, విచ్చలవిడిగా విలయ తాండవం చేస్తున్నప్పుడు ; రాక్షస ప్రవృత్తి పెచ్చు పెరిగినప్పుడు అటువంటి మహనీయులు, మహాత్ములు మానవ రూపాన్ని ధరించి మానవులలో కలిసి మెలిసి తిరుగుతూ, మానవత్వాన్ని ప్రబోధిస్తూ రాక్షసత్వాన్ని దూరం చేస్తుంటారు. వారు సత్కర్మలను ఆచరిస్తూ ఇతరులచేత ఆచరింప చేయిస్తుంటారు. వారు సన్మార్గాన నడుస్తూ ఇతరులను నడిపిస్తుంటారు. సమాజంలో శాంతిని నెలకొలిపి మానసిక పరివర్తనను తీసుకొనివచ్చి మనశ్శాంతిని ప్రసాదిస్తూంటారు. వారు ప్రదర్శించిన ప్రేమ, పలికిన పలుకులకు యావత్ మానవాళి పాదాక్రాంతమవుతూ వస్తున్నది. తరతరాలుగా, యుగ యుగాలుగా, నిరంతరంగా ఇది కొనసాగుతునే ఉన్నది.

కొమరగిరి కృష్ణమోహనరావు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

శ్రీ శారదామాత జీవితాన్ని పరికిస్తే మనకు గోచరించే సత్యం ఒక్కటే. భారతస్త్రీ ఔన్నత్యం గొప్పతనం, మహత్తు, ప్రతిభ ఎటువంటివో ఆమె జీవితమే ఒక చక్కటి ఉదాహరణ. ఆమె ప్రదర్శించిన సహనం, చూపిన వినమ్రత స్త్రీలకు అత్యంత ఆదర్శపూరితమైనది. ఆమె స్త్రీల బాధ్యతలను గురించి ప్రబోధించిన తీరు మహోన్నతమైనది. " స్త్రీలకు ముంగోపము తగదు. వారు ఓరిమి నలవరచుకొనవలెను. వారికి శైశవమునను, బాల్యమునను తల్లిదండ్రులు ; యౌవనమున భర్తలు పోషకులు. స్త్రీ బుద్ధి సామాన్యముగా మిక్కిలి సున్నితము, సులభముగా నొచ్చుకొనునది. ఒక్కమాట చాలును వారిని తలక్రిందులు చేయుటకు. ఈ కాలములో ఎంత ఘాటైన మాటైననూ సులభముగా అందురుగదా ! కావున స్త్రీలు ఓరిమి నభ్యసించి తల్లిదండ్రులయొక్కయు, భర్తయొక్కయు మాటల యెడ తాలిమి కలిగి ప్రవర్తించవలెను. " అని చెప్పిన శ్రీ శారదామాత మాట భావ గర్భితము. స్త్రీ మానసిక స్థితి చక్కగా వర్ణించినది. అంతేకాదు స్త్రీ బాధ్యతను, కర్తవ్యాన్ని ప్రబోధించింది. అంతటితో ఆగలేదు. స్త్రీ మానసిక ప్రవృత్తిని అర్థం చేసుకొనని పురుషులకు ఒక చురక వేసింది. ఈ మాట

శ్రీ గురూజీ చెప్పిన కథలు :

## మైత్రి

ఒకప్పుడు గుఱ్ఱం పెంపుడు జంతువుకాదు. స్వతంత్రంగా జీవిస్తుండేది. అడవుల్లో తిరుగుతుండేది. ఒకరోజున సింహం దానిని తరుమసాగింది. ప్రాణ భయంతో గుఱ్ఱం పరుగెత్తింది. కాని సింహం దానిని వదలిపెట్టలేదు. గుఱ్ఱం అలసిపోయింది. జీవితం మీద ఆశ వదులుకొంది. ఇంతలో దానికి ఒక మనుష్యుడు ఎదురైనాడు. గుఱ్ఱం "సోదరా ! నన్ను సింహం బారి నుంచి రక్షించు" అంటూ అతనిని ప్రార్థించింది.

"నేను సింహాన్ని చంపగలను. కాని నేలమీద నుంచి కాదు. నీవు నన్ను వీపుమీద ఎక్కనిస్తే, నేను సింహంతో పోరాడి చంపుతాను" అన్నాడు. గుఱ్ఱం అందుకు ఒప్పుకున్నది. గుఱ్ఱంపైన కూర్చుండి అతడు సింహాన్ని చంపాడు.

గుఱ్ఱం సంతోషించింది. "అయ్యా ! నేను తమకు ఎంతగానో ఋణపడి ఉన్నాను మీరు దిగితే నా దారిన పోతాను" అన్నది. అతడు "నీ పైన కూర్చొని స్వారీ చేస్తుంటే నాకు ఎంతో ఆనందంగా ఉంది నాకు దిగాలని పించటంలేదు." అన్నాడు. అతను దిగలేదు. నాటినుండి గుఱ్ఱం మనుష్యునికి బానిసగా మారింది.

ఒక్కొక్కసారి మన నాయకులు మనకు రష్యా మిత్ర దేశమని, మరొకసారి అమెరికా సహాయంతో శత్రువుల నెదుర్కొంటామని చెబుతుంటారు అట్లా సహాయం చేయడానికి వచ్చినవారు మన నెత్తిన కూర్చుంటారని మరచిపోరాదు.

('కథాకల్పతరువు' నుండి)

లను పరికిస్తే శ్రీ శారదాదేవి ఎంతటి అనుభవశాలో అర్థమవుతుంది.

మరొక సందర్భమున ఒక భక్తుడు శ్రీ శారదామాత వద్దకు వచ్చి తన కుమార్తెను వివాహము చేసుకొనేట్లుగా చేయమని కోరుతాడు అప్పుడు ఆమె "జీవితకాలమంతయు ఒకనికి బానిసయై వాని యిష్టానుసారము ప్రవర్తించుట ఎంత కష్టము ? పెండ్లి చేసుకొనకుండా వుండటంలో కొంత అపాయము వున్న మాట వాస్తవమే. కానీ పెండ్లాడుటకు ఇష్టపడని బాలికలను బలాత్కారముగా పెండ్లిండ్లు చేసి యావజ్జీవము ఐహిక జీవనము పాలుచేయుట అనుచితం. పరిపూర్ణ విరక్తితో జీవితము గడపగోరు బాలికలను బ్రహ్మచారిణులుగా నుండుటకే ప్రోత్సహించవలెను" అని పలికిన మాతృదేవి పలుకులు అత్యంత ప్రధానమైనవి. అభ్యుదయవాదులమని సంఘ సంస్కర్తలమని, సమాజంలో విప్లవాత్మకమైన మార్పులను ఆకాంక్షించేవారమని ప్రచారం చేసుకుంటున్న వారికన్నా శ్రీ శారదామాత ఇంకా ఎంతో దూరదృష్టిగల విజ్ఞతగల అభ్యుదయవాది అనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు "స్త్రీకి స్వాతంత్ర్యం కావాలి !" అని వాదిస్తున్నవారికన్నా ఈమె అత్యంత ప్రగతిశీలభావాలు కలిగినదనటంలో కూడా ఏ మాత్రం సందేహం లేదు. వివాహం విషయంలో స్త్రీకి పూర్తి స్వేచ్ఛ కావాలనేదే ఈమె ఆశయం. వివాహ వ్యవస్థ అత్యంత పవిత్రమైనదని ఈమె అభిప్రాయం. ఐహిక జీవనమునకు దూరంగా వుంటూ, పరిపూర్ణ విరక్తితో జీవితమును గడుపదలచుకొని, పవిత్రమైన శీలమును ప్రాణప్రదంగా కాపాడుకుంటూ, జీవితాంతం బ్రహ్మచారిణులుగా వుంటూ, దైవ చింతనలో నిరంతరం కాలం గడుపుతూ, సత్కర్మలను ఆచరించు శక్తిగల వారిని మాత్రమే వివాహం చేసుకొనవద్దని చెప్పినదిగాని, వివాహము స్వేచ్ఛకు, ఇష్టం వచ్చినట్లుగా తిరగటానికి ప్రతిబంధకమని వాదించేవారికి చెప్పలేదు. పైపెచ్చు పెండ్లి లేకయుండుటయందు కొంత అపాయమున్నదనికూడా హెచ్చరించినది కనుక ప్రతి

ఒక్కరూ శ్రీ శారదామాత మాటలలోని అంతరార్థమును చక్కగా అర్థం చేసుకొని ఆచరణలో పెట్టడం సముచితం.

అత్తవారింటికి కాపురమునకు వెళ్ళుచున్న ఒక స్త్రీతో "ఎవరితో గాని విస్తారముగా చనువు కల్పించుకొనకుము. ఇతరుల విషయముల నెఱుగుటకై కుతూహలపడకుము. ధ్యాన ప్రార్థనల కాలమును క్రమక్రమముగా అధిక పఱచుచుండుము" అని చెప్పెను. మరొక గృహస్థ శిష్యురాలిని చూచి "మగవారితో - నీ తండ్రితో, నీ సోదరునితో గూడ విస్తారముగా, మచ్చికగా నుండ వలదు. ఇతరుల విషయమిక చెప్పవలయునా? మరొకసారి చెప్పుచున్నాను. వినుము. మగవారెవ్వరితోను - భగవంతుడా రూపమున వచ్చినను మచ్చిక వలదు" అన్న శ్రీ శారదామాత మాటలు ఎంతో అనుభవపూర్వక మైనవి, వాస్తవమైనవనటంలో ఏ మాత్రం సందేహం లేదు.

ఇంకా ఐదు దినములలో మాతృదేవి నిర్యాణం పొందబోతున్న సమయంలో "అన్నపూర్ణ తల్లి" అనే భక్తురాలు ఆమెను సందర్శించటానికి వచ్చింది. అప్పుడు ఆమె గదిలోనికి ఎవ్వరినీ వెళ్ళనివ్వటంలేదు. చేయగలిగేదేమి లేక ఆ భక్తురాలు ద్వారమువద్దనే కూర్చున్నది. మాతృదేవి ఆమెను చూచి దగ్గరకు రమ్మనమని సంజ్ఞ చేసినది. ఆమె వచ్చి పాదాభివందనం చేసి "అమ్మా! ఇక మా గతేమి?" అని ఏడువసాగింది. అప్పుడు శ్రీ శారదామాత ఆమెను ఓదారుస్తూ "నీకేమి భయము? ఠాకూరును (శ్రీ రామకృష్ణుని) చూచితివి గదా! నీకొక సంగతి చెప్పెదను. మనశ్శాంతి గోరెదవా ? పరులనెన్నడునూ నిందింపకు. ఇతరుల తప్పు లెంచకుము మొదట నీలోని తప్పులను పరిశీలించుకొనుము. ప్రపంచమంతటిని నీదిగనే చూడుకొనుము. లోకమున నీకెవ్వరూ అన్యులు కారు. సమస్త విశ్వమూ నీదే!" ఇదియే లోకమునకు యిచ్చిన మాతృదేవి చరమ సందేశము, ఆదేశము. శ్రీ శారదామాత ఉపదేశములను ఆచరించిన యడల మనిషికి మనశ్శాంతి, లోకములో శాంతి నెలకొంటుంది. విశ్వమంతా తనదేనని భావించినప్పుడు దేశాల మధ్య ఏర్పర్చుకున్న ఎల్లలు, మానవుల మధ్య నెలకొనివున్న అడ్డులు వాటంతట అవే తొలగిపోతాయి. "వసుధైక కుటుంబం" నినాదం అమలులోనికి వస్తుంది. అప్పుడు ప్రపంచశాంతి ఏర్పడుతుంది

సోదరి నివేదిత శ్రీ శారదామాతకు వ్రాసిన లేఖను పరికిస్తే శ్రీ శారదామాత ఎంతటి ప్రేమస్వరూపిణియో అర్థమవుతుంది. " అమ్మా ! నీవు ప్రేమమూర్తివి ! ఆవేశముతో, ఉద్రేకముతో కూడిన మా ప్రేమ వంటిదియు, లోకుల ప్రేమ వంటిదియు కాదు, నీ ప్రేమ. ఎవ్వరికిని హాని కలిగింపనిదియు, ఎల్లరుకునూ మేలు చేకూర్చునదియు నగు మధుర మంజుల ప్రశాంతి నీ ప్రేమ. చిద్విలాసమయమై అది స్వర్ణకాంతుల నీను చుండును. నిజముగా ఈశ్వర సృష్టిలో నీ యంత అద్భుత వస్తువింకొకటి కానరాదు. ఇది నిస్సంశయము. నిజముగా నీవు భగవానుని యద్భుత రచనము. లోకమున స్వయముగా శ్రీ రామకృష్ణుడు ప్రసాదించిన ప్రేమామృత కలశము. శ్రీ రామకృష్ణుడు తన అవతార సమాప్తి పిదప కూడ లోకులకు లభ్యమగునట్లు, వారికి శ్రేయస్సు చేకూరునట్లు, తన విశ్వ ప్రేమామృతమును నించి యుంచి పోయిన దివ్య పాత్రమే మీరు. అనాథలమై అసహాయమై యున్న ఈ కాలమున తన బిడ్డలకై ఆయన ఉంచిన ప్రత్యామ్నాయ స్వరూపులు. కావున మేము మీ వద్ద మిక్కిలి నిశ్శబ్దముగా, మౌనముగా వుండవలెను" అని సోదరి నివేదిత లేఖ వ్రాస్తుంది. భారతీయులే గాక, విదేశీయులు సహితం శ్రీ శారదామాత సచ్ఛీలసంపదకు పాదాక్రాంతమైరి. వినయశీలతకు దాసోహమనిరి.

శ్రీ వివేకానందస్వామి ఒక పర్యాయం అమెరికా నుంచి సోదర శిష్యునకు మాతృదేవిని ప్రశంసిస్తూ, ఆరాధిస్తూ వ్రాసిన లేఖను చూస్తే ఆయనకు శ్రీ శారదామాత యెడల గల అకుంఠిత భక్తి ఎంతటిదో బోధ పడుతుంది. "భారతదేశమున అద్భుతశక్తిని పునరుజ్జీవింప చేయుటకే అమ్మ జన్మించినది. ఆమెను మూలాధారముగా చేసుకొని గార్గులును, మైత్రేయులును లోకమున మరల

## చెక్క భజన

వాడు
రోజుకో మనిషిని
వంజుకు తినే
బకాసురుడు !
ఇక్కడ
భీముడు లేని ఏకచక్రపురంలో
మేము !
మా ధన ప్రాణ మానాలు
మూట కట్టి
వాడి చేతిలో పెట్టాము
మా బ్రతుకు చెట్టు తొర్రలో వుండే
పంచ వన్నెల రామచిలుక గొంతు
వాడి గుప్పిట్లో వుంది !
మేం కదిలినా మెదిలినా
మా అంతు చూస్తాడు !
అందుకే మేం
వాడి చుట్టూ తిరుగుతూ
చెక్క భజన చేస్తూ
వాడి కాళ్ళ ముందు సాష్టాంగపడి,
మమ్మల్ని తన్నుతున్న వాడి
బూట్లు నాకుతున్నాం
నిగనిగ మెరిసేలా !!

-డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు

ప్రభవింతురు. కావున మాతృదేవికై మొదట మనము మఠమును నిర్మింపవలయును. శక్తికటాక్షము లేనిదే యేమియూ సాధింపజాలము. అమెరికా, ఐరోపా ఖండములలో నాకు గోచరించినది శక్తిపూజే. కానీ వారు శక్తి (స్త్రీ) ని ఇంద్రియతృప్తికై ఆరాధించుచున్నారు. అకలంక హృదయంతో, శుద్ధ సాత్త్విక భావముతో, శక్తిని తమ మాతృదేవతగా నారాధించువారు ఎట్టి శ్రేయమును పొందుదురో ఒక్కసారి ఊహింపుము. మాతృదేవి ఆశీస్సులు నాకు వరప్రసాదములు. నేను అమెరికాకు వెళ్ళుటకు ముందు ఆమె ఆశీస్సులు నాకు లభించినాయి. ఒక్క దుముకులో సముద్రాన్ని లంఘించినాను'' అని స్వామి వివేకానంద వ్రాసిన లేఖను పరిశీలిస్తే శ్రీ శారదామాత యెడల గల భక్తి ప్రపత్తులు ఎటువంటివో అర్థమవుతుంది. అంతేకాదు శ్రీ రామకృష్ణపరమహంస నుండే గాక శ్రీ శారదామాత నుండి కూడా వివేకానంద స్ఫూర్తిని పొందాడనే విషయం ద్యోతకమవుతుంది. భర్తను మించిన భార్యయే గాక, భర్త సిద్ధాంతాలను, ఆశయ-ఆదర్శములను ఆచరణలో పెట్టి శిష్యులచేత ఆచరింపజేసిన మహిమాన్విత శక్తిగల మహిళారత్నం శ్రీ శారదాదేవి.

1853 సం. డిశంబరు 22 న జన్మించిన శ్రీ శారదా మాత ఆరేండ్ల ప్రాయముననే శ్రీ రామకృష్ణ పరమహంసకు భార్యయై, తన అమృతాశీస్సులచే స్త్రీ పురుషులను తన జ్ఞాన ప్రేమమయ వాక్కులతో ఉత్తేజింపజేసి, వారి పరితప్త హృదయములకు శాశ్వత శాంతిని ప్రసాదిస్తూ, భక్తి జ్ఞాన మార్గములను ప్రబోధిస్తూ, నిరాడంబరమైన, ఆదర్శప్రాయమైన జీవితమును గడుపుతూ 1920 సం. జూలై 20 వ తేదీన కలకత్తాలో మహాసమాధినందెను. ఆమె ఆదర్శ హైందవస్త్రీగా పేరు ప్రఖ్యాతుల నందుకొని మాతృదేవిగా ప్రేమామృతమును అందించిన ప్రేమమూర్తి శ్రీ శారదామాత. ఆమె జీవితమే యావత్ ప్రపంచానికి స్ఫూర్తిని, శక్తిని ప్రసాదించింది. భారతస్త్రీ మహత్తర శక్తిని ప్రపంచానికి చాటింది ఆమె చూపిన మార్గం, నడచిన బాటను అనుసరించిన శుభదినాన సమాజంలో ఎట్టి కలతలకు కార్పణ్యాలకు అవకాశమే వుండదు. అప్పుడే ఆమెకు నిజమైన శ్రద్ధాంజలిని సమర్పించిన వారమవుతాము. ★




పొందుగ పాదము లిచ్చినదెందుకు ?
సందులు గొందులు తిరుగుటకా ?
అందుకు గాదు ; నందివాహనుని
మందిరమ్మున తిరుగుటకు —

సాధారణముగ కృష్ణుడు శాంతికాముకుడు కాదనీ, కేవలం యుద్ధోన్మాదియని, అతని యుద్ధోన్మాదం వల్లనే భారతయుద్ధం జరిగిందనీ, లక్షలమంది ప్రాణాలు కోల్పోయారని, రక్తం ఏరులై పారిందనీ -ఇదంతా జరగడానికి కృష్ణుడే మూలకారణమని కొందరు భావిస్తుంటారు. ఇది ఏమాత్రం సత్యం కాదు. కౌరవ పాండవులకు సన్నిహిత సంబంధమును కూర్చే నిమిత్తమై కృష్ణుడు పడిన శ్రమ ఎంతటిదో వ్యాసుని సంస్కృత భారతం చదివినవారికి అర్థమవుతుంది.

**రాజనీతి**

కృష్ణుడు రాయబారము సలిపే నిమిత్తమై హస్తినాపురమునకు బయలుదేరినాడు. ఈ వార్త వినిన దుర్యోధన దుశ్శాసనాదులు స్వాగత ఏర్పాట్లను గావించి, సర్వాంగ సుందరమైన విడిది సౌకర్యములను కల్పించి పురమునకు ముందు భాగమున స్వాగతము చెప్పుటకు వేచియున్నారు. కృష్ణుడు తన రథమును పురము ముందుకు తీసుకొని వచ్చి నిలిపినాడు. అతడు రథము దిగిన తక్షణమే దుర్యోధన దుశ్శాసనాదులు నమస్కరించి "ప్రభూ! తమకు ప్రత్యేకమైన ఏర్పాటులు గావించితిమి. విడిది మందిరములో నివాసము చేయవచ్చును. ఈనాడు మా విందుకు దయచేయవలెను." అని ప్రార్థించినారు. సహజ శాంతి స్వరూపుడును, సహన వినయశీలుడైన శ్రీకృష్ణుడు దుర్యోధన దుశ్శాసనులను ఇరు ప్రక్కల చేర్చుకొని, వారి వీపులను నిమురుతూ "నేను కార్యార్థమై వచ్చిన దూతను. దూత తమ ప్రభువు కార్యము సఫలము కాక పూర్వమే అతిథిగా నుండుట రాజనీతి కాదు కనుక నేడు నేను ఎక్కడైనా నివాసము చేసి, రేపటి దినము రాయబారము పూర్తిఅయిన తరువాత తప్పక మీ ఇంటికి వచ్చి, మీ విందును అరగించుదును." అని చిరునవ్వుతో సమాధానము చెప్పి, నేరుగా విదురుని ఇంటికి వెళ్ళిపోయినాడు

---

**శ్రీసత్యసాయిబాబా**

## విదురుడు

కలలోనైనా తలవని విధముగా కృష్ణుడు తన ఇంటికి రావటము చూచి విదురుడు ఆనందించినాడు. కృష్ణుని కౌగలించుకొన్నాడు. ఇది నా భాగ్యమని భావించాడు. హృదయపూర్వకంగా ఆతిథ్యమిచ్చినాడు. భోజనమైన తరువాత విదురుడు కృష్ణునితో "స్వామీ! తమకు తెలియని విషయమున్నకాదు. దుష్టులు, దుర్మార్గులయిన కౌరవ పుత్రుల సన్నిధికి సంధి కొరకు తాము రావటము సరియైనది కాదు. వారు సద్గుణవంతులుకారు. వారు తమకు ఎట్టి అపకారము చేయుటకైనా సంసిద్ధులే. తమకు సర్వమూ తెలిసి కూడా దీనికి మీరు ఒప్పుకొనుట నాకు చాలా విచారకరముగా ఉన్నది" అని అన్నాడు. అప్పుడు కృష్ణుడు "విదురా! వారి తత్వము నేను ఎరుగనిది కాదు. నిరపరాధులకు అపరాధము జరుగుతున్నప్పుడు, దాని నివారణకు తగిన ప్రయత్నము చేయకుండుట ప్రభుశక్తి కానేరదు. సాధ్యమైనంతవరకు, నా శక్తి

సామర్థ్యముల నుపయోగించి సంధి కుదుర్చుటకు నేను వచ్చితిని " అని వెల్లడి చేసినాడు. ఈ వాక్యములలోని అంతరార్థమును గమనించినచో శ్రీకృష్ణుడు దేశశాంతికి, భద్రతకు ప్రయత్నించిన శాంతికాముకుడే గాని, యుద్ధోన్మాది కాడని స్పష్టమవుతున్నది. కృష్ణుడు చేసిన పనులు మానవమాత్రులు చేసినవే గాని, దైవస్వరూపుడు చేసినవిగా భావించరాదు విదురుడు " స్వామీ ! సంధి కుదురునను నమ్మకము నాకు లేదు వారు ఇప్పటికే అన్నీ సిద్ధము చేసికొన్నారు. అట్టివారు సంధికి ఒప్పుకొని ఒప్పందమునకు వత్తురా ? " అని సందేహమును వెలిబుచ్చినాడు. " విదురా ! నీకు తెలియని ధర్మము లేదు. దర్మస్థాపన నిమిత్తమై మన శక్తి సామర్థ్యములున్నంతవరకు పాటుపడుట మన కర్తవ్యము. జయాపజయములకు వెనుకంజ వేయకూడదు. " అన్నాడు శ్రీకృష్ణుడు.

## స్వాగతాలంకారములు

తెల్లవారినది. రథమునెక్కి శ్రీకృష్ణుడు హస్తినాపురమునకు ప్రయాణము సలిపినాడు. ఆనాడు హస్తినాపురమంతయు కళ్యాణమంటపమువలెనే ఉన్నది. ఆ సౌందర్యము, ఆ యలంకారమును, స్వాగతము చెప్పటానికి అలంకరించబడిన ఆ పూల పందిళ్ళను చూస్తూ వెళ్లినాడు కృష్ణుడు. ఆ యాదవచంద్రుని చూచి హస్తినాపుర ప్రజా సముద్రము ఉప్పొంగుతూ వచ్చింది వీధులవెంట. వచ్చిన హస్తినాపుర ప్రజలను చూచి చిరునవ్వులు నవ్వుతూ, ప్రయాణము సలుపుతూ రాజభవనము ముందున్న సింహద్వారము వద్దకు చేరినాడు అక్కడ సుయోధనుడు, కర్ణుడు, కష్ణునికి స్వాగతమిచ్చుటకై సంసిద్ధులుగా నిలచినారు. పండితులు స్వస్తివచనములు పలికినారు. సుమంగళులు, పుష్పములు చల్లినారు పై అంతస్తుల నుండి పన్నీరు చల్లినారు ఇవన్నీ కేవలం కౌరవులు తనను ఆకర్షించటానికి ఏర్పరచినటువంటి కృత్రిమ దృశ్యములుగా గోచరించినవి కృష్ణునికి వీనికి పొంగక లొంగక కృష్ణుడు సభామందిరంలో ప్రవేశించినాడు.

కృతవర్మ సర్వాయుధములను ధరించి వినయ విధేయతలను నటించుచు కృష్ణుని అనుసరించినాడు.

## కృష్ణుని వినయం

కృష్ణుడు సభామందిరంలో ప్రవేశించగానే రాజులు, సామంతరాజులు లేచి నిలుచున్నారు. ధృతరాష్ట్రుడు భీష్మ ద్రోణుల సహాయంతో ఎదురుగా వచ్చి కృష్ణుని కౌగలించుకొని, స్వాగత వాక్యాలు పలుకుతూ, ఉన్నతాసనము వద్దకు తీసుకొనివెళ్ళి, ఆసనముపై కూర్చుండుటకై ప్రార్థించినాడు కాని కృష్ణుడు కూర్చోలేదు. కృష్ణుడు ద్రోణుని పిలచి " ద్రోణా ! నీకు తెలియని విషయము కాదు ఈనాడు ఈ సభామందిరమునకు ఎందరో మహాపురుషులు, యోగులు విచ్చేసినారు. వారలకు తగిన ఆసనములను ముందుగా సమర్పించండి " అని చెప్పినాడు. వారలకు తగిన అనుకూలమైన ఆసనములను సమకూర్చిన పిదప, సభకు నమస్కరించి తాను కూడా ఆసనమును అధిష్ఠించినాడు కృష్ణుడు. ఇది శ్రీకృష్ణుని వినయ విధేయతలను సూచిస్తున్నది. అతడు చెప్పే వాక్కులను వినాలనే ఉత్సుకతతో అంతా నిశ్శబ్దంగా ఎవరి ఆసనాలలో వారు కూర్చున్నారు.

## కృష్ణుని హితవు

కృష్ణుడు ఒక్కసారి లేచి సభకు నమస్కరించి ధృతరాష్ట్రుని వైపుకు తిరిగి మొట్టమొదట " కౌరవ సుతులకు, పాండవులకు శాంతి కలుగుగాక ! వీరి ఇరు వంశములు కూడ శాశ్వతముగా నిలిచి లోకమునకు కళ్యాణము నొసంగుగాక. " అని అన్నాడు ఈనాడు లోకమున ఆశించేది దేశశాంతి. లోకశాంతికై నేను రాయబారిగా వేంచేసితినని చెప్పి నమస్కరించాడు. ఇంతటితో పోక ధృతరాష్ట్రుని చేతులు పట్టుకొని " మహారాజా ! ఈనాడు జరుగుచున్న సమావేశములోని నిర్ణయములను మీరు ముందు యోచించుకోవలసి ఉంది. ఇప్పటి పరిస్థితి చూస్తే దేశమంతా రక్తపాతంలో మునిగేటట్లుంది. మీరు ఏమీ తెలియనివారు కాదు. సర్వజ్ఞ

లైన మీకు పేరే చెప్పనవసరంలేదు. చక్కగా యోచించుకోండి. పసిపాపలుగా ఉన్నప్పుడే పాండవులు తండ్రిని కోల్పోయినారు. ఆ అమాయకులైన పిల్లలను నీవు తండ్రివలె పెంచి పెద్దచేసినావు. కామజనకుడు లేకున్నా ప్రేమజనకుడు చిక్కినాడని సంతోషించినారు పాండవులు. వారిని నీవే అభివృద్ధి చేసినావు. నీ కామ పుత్రులవలె ఈ ప్రేమ పుత్రులను సర్వవిద్యలు గరిపి ఉన్నతస్థానంకి తీసుకొనివచ్చినావు. అట్టి పుత్రులపై ద్వేషము పూనుటము సరియైనది కాదు. తమ ఆజ్ఞను అనుసరించి పన్నెండు సంవత్సరములు అరణ్యవాసము, ఒక సంవత్సరము అజ్ఞాతవాసము ముగించుకొని వచ్చినచో వారి రాజ్యము వారికి ఇత్తునని తమరే చెప్పియుండటచేత, ఆ కార్యమును కూడ వారు పూర్తి చేసుకొని వచ్చినారు. కనుక తమరు మాట నిలబెట్టుకొనే ప్రయత్నము చేయండి అంతేకాదు నేనిక్కడకు బయలుదేరి వచ్చేటప్పుడు ధర్మజుడు నా చేతులు పట్టుకొని చెప్పిన విషయములు మీకు చెప్పుచున్నాను. తెలిసియో, తెలియకో చేసిన మా తప్పులు ఏమైనా ఉంటే క్షమించి మాపై ద్వేషము పూనక రాజ్యము నిచ్చినా, ఈయకపోయినా ధృతరాష్ట్రుని ప్రేమ మాపై ఉండునట్లుగా ప్రార్థించమని నన్ను యాచించినాడు మాపై ఇంత ద్వేషము పూనుటకు ఏ కారణమూ లేదు. అట్టి కారణములు ఏమైన ఉండిన మేమే వచ్చి క్షమార్పణ వేడుకుంటామని ధర్మజుడు ప్రార్థించినాడు. ఈ విధమైన కృష్ణుని హితవు పలుకులు మనం వింటుంటే నిజంగా పాండవులు ఎంతటి పవిత్రులో, ధర్మాత్ములో మనకు అవగత మవుతుంది. అంతేకాదు అతడు యుద్ధోన్మాది అనుటకు ఏమాత్రం అవకాశము లేదు. ఇరు వంశములవారి మధ్య, దేశములో శాంతిని ప్రతిష్ఠించుటకై అతడు ఎన్నిరకములైన అవస్థలకు గురియైనాడో మనకు తెలుస్తుంది.

## ఆపద హెచ్చరిక

కృష్ణుడు చెబుతున్న మాటలు వింటున్న సభా మందిరంలోని రాజులు కన్నీరు కార్చినారు. అతని



వినయ విధేయతలను చూచి, పాండవులు పంపిన సందేశమును విన్న ప్రతివారికి కౌరవుల మీద అసహ్యము వేసింది. తన కుమారులు అన్యాయ అక్రమాలకు పాలు పడుతున్నారనే సత్యము ధృతరాష్ట్రునికి తెలియనిదికాదు. కాని చేయునదిలేక కుమారులకు లొంగి బలహీనుడైనాడు. అతడు ఎన్ని చెప్పినా ధృతరాష్ట్రుడు సంధికి అంగీకరించలేదు. కృష్ణుడు భరించలేక "ధృతరాష్ట్రా! తనది కాని రాజ్యమును తనదిగా భావించుకొని ఎవరు భోగభాగ్యములు, సుఖములు అనుభవిస్తారో వారు దొంగలవంటివారు." అన్నాడు. "ధృతం యేన రాష్ట్రం ఇతి ధృతరాష్ట్రః" తనది కాని దానిని తనదిగా భావించుకొనేవాడు ధృతరాష్ట్రుడు. "మహారాజా! నీ కుమారులు కారణంగా యావత్ప్రపంచం రక్తపాతంలో మునిగిపోవుటకు అవకాశం ఉంది. స్త్రీలనూ, శిశువులనూ, అడవులలో తపస్సుచేసుకొనే ఋషులనూ, మహనీయులనూ రక్తపాతములో ముంచే పరిస్థితి కల్పిస్తున్నారు ఈ యుద్ధము కేవలము కౌరవులకూ పాండవు

లకు మాత్రమే కాదు. రాజ్యంలో వున్న ప్రతి వ్యక్తి యుద్ధోన్మాదిగా తయారవుతాడు. ఓ పిచ్చి మహారాజా ! అరణ్యములో పుట్టిన అగ్ని చేదు పండ్లను ఇచ్చే వేప చెట్లను కాల్చి, తియ్యని పండ్లను ఇచ్చే మామిడిచెట్లను కాల్చకుండా విడుచునా ? దుర్మార్గమనే అగ్ని సర్వత్రా వ్యాపించి ఈ యుద్ధమనే హోమములో సర్వులూ ఆహుతులై పోతారు. కావున యుద్ధమును మానుకో " అని హితవు చేస్తాడు.

## ధృతరాష్ట్రుని బలహీనత

సభామధ్యమున ఏమి చెప్పుటకు ధృతరాష్ట్రునకు తోచక విశ్రాంతి కావలెనన్నాడు. ఆ అంతర్భావమును గ్రహించిన కృష్ణుడు అతనిని ప్రత్యేకంగా తీసుకొని పోయి ఉన్న సత్యాన్ని చక్కగా విశదీకరించాడు. కృష్ణుడు ఓదారుస్తూ ఉంటే ధృతరాష్ట్రుడు " కృష్ణా ! దుర్మార్గులు, దుష్టులు, దురహంకారులు, నా కుమారులు కావటంచేత నేను వారిని ఎదిరించలేకపోతున్నాను. నన్ను క్షమించు. వారివి సంతృప్తిపరచుటకు వారినే అనుసరించక తప్పదు. " అన్నాడు. ఇదే సరియైన సమయమని భావించి కృష్ణుడు " ధృతరాష్ట్రా ! నీ శరీరమునందు పుట్టిన మంచినైనా, చెడునైనా పోషించుటకు పూనుకుంటున్నామా ? శరీరంలో పుట్టిన మలమూత్రములను విసర్జించి శుభ్రపరచుకోవటంలేదా ? " అన్నాడు. " మలమూత్రములు జడమైనవి. నా కుమారులు చైతన్యరూపులుకదా ! " అన్నాడు ధృతరాష్ట్రుడు. వెంటనే కృష్ణుడు " మన దేహమునందు పేనులు మొదలైన క్రిములు పుడుతున్నాయి వానిని పోషిస్తున్నామా ? నీ కుమారులు నీ దేహమున పుట్టిన క్రిమికీటకముల వంటివారు. " అన్నాడు. ఇట్టి కఠినోక్తులు అడుటచేత ధృతరాష్ట్రుని మనసు కొంతవరకు మారింది. తన తండ్రిని పాండవుల వైపు మరల్చుకుంటున్నాడని దుర్మార్గులైన కౌరవులు భావించి కృష్ణుని బంధించటానికి కొన్ని పన్నాగములు పన్నినారు. కృష్ణునికేమైనా ప్రమాదం జరుగుతుందేమోనని విదురుడు కృష్ణుని తీసుకొని పోవుటకు అనేక ప్రయత్నములు చేసినాడు. కృష్ణుడు మాత్రం ప్రాణత్యాగమునకు కూడా సంసిద్ధముగా నుండి దేశ క్షేమమునకై యుద్ధమును మాన్పించవలెనని అనేక ప్రయత్నములు చేసినాడు. దురదృష్టవశాత్తు భారతదేశమునకు చక్కని, యదార్థ చరిత్రలు అందించే వ్యక్తులు లేకపోవటంచేత, దుర్మార్గమైన సత్యదూరమైన పుస్తకములు చదివి పవిత్రమైన, శాంతమూర్తిని అపార్థం చేసుకుంటున్నారు. చాలామందికి సంస్కృతం రాకపోవటముచేత వ్యాస భారతమును చదివే అవకాశము లేకుండా పోతున్నది.

## శిశుపాలుడు

పాండవులు రాజసూయయాగంలో అగ్రతాంబూలమెవ్వరికివ్వవలె ? అని గాలిస్తుండగా భీష్మ ద్రోణాదులు కృష్ణునివైపు సైగ చేయుటతో, ధర్మరాజు అగ్రతాంబూలము కృష్ణునికి అందించినాడు ప్రక్కనున్న శిశుపాలుడు కృష్ణుని నోటికి వచ్చినట్లు తూలనాడాడు. ఆ కఠినోక్తులు చుట్టూ ఉన్నవారికి సహించలేనివిగా ఉన్నాయి. కృష్ణుడు చిరునవ్వుతో, సహనంతో విన్నాడు. శిశుపాలుడు సభా మధ్యమున లేచి

" స్నానంబు చేయు ఆ జవరాండ్ర చీరలు
కాజేసినందుకా పూజ నీకు
గొల్ల పూబోండ్లతో జల్లులాడిననాడు
హర్షించినందుకా అర్ఘ్యమిడుట "

అని తక్షణమే భీష్ముని దగ్గరకు పోయి

" బాలునిక కట్టిపెట్టు పంచాంగ మింక
పొగడుకొనబోకు చాలించి మూయు నోరు
చాల దీ నాల్క శ్రీకృష్ణు సన్నుతింప
నూరు చీల్కలు చీల్తు నోరోరి భీష్మ "

అన్నాడు.

ఆ సభలో ఉన్నవారికి చాలా భయము ఏర్పడింది. సభలో. కల్లోలము, కలకలము ఏర్పడింది. కృష్ణుని మోములో మాత్రం చిరునవ్వులు చిందుతూనే ఉన్నాయి.

క్రోధము, ఆందోళన అతనిలో కనిపించలేదు. ఇవన్నీ అజ్ఞానంతో అదే మాటలుగా భావించాడు. అర్జునునికి భీమునికి కండలు కదిలాయి. వారిని శాంతంగా ఉండు డని కృష్ణుడు సైగ చేసినాడు భీష్ముడు లేచి గంభీర స్వరంతో "సర్వాధికారి శ్రీకృష్ణుడే తప్ప అన్యులు లేరు" అన్నాడు "శిశుపాలా! రుక్మిణీ కళ్యాణములో పుట్టిన పాత ద్వేషము నిన్ను ఉద్రేకపరుస్తున్నది. ఈ సభలో కృష్ణునికన్నా అధికారి ఎవరైనా ఉన్నారేమో చూపించు" అన్నాడు ఇంకను భీష్ముడు "ఈ సభలో చేరిన రాజులందరూ ఏదో ఒక సమయంలో కృష్ణుని చేతిలో పరాభవం పొందినవారే. సద్గుణములలో కృష్ణుని మించిన వారు లేరు. ధర్మస్వరూపుడు, నిస్వార్ధసేవాపరుడు, ప్రేమస్వభావుడు, కృష్ణుని అరికాలినుండి శిరము వరకు ప్రేమ రక్తమై ప్రవహిస్తూ ఉంటుంది. కృష్ణుడు సర్వ గుణ సంపన్నుడు. కావున అతడు తప్ప అధికారి మరెవరున్నారు ?" అన్నాడు. ఈ వాక్యములను విన్న రాజులు సంతృప్తి చెందారు. ద్రోణాచార్యులు కూడా ఇదే నిర్ణయించినాడు. కానీ శిశుపాలునికి పిచ్చెత్తి నట్లయింది "వినాశకాలే విపరీత బుద్ధిః" అన్నట్లు విపరీతమైన చేష్టలు మొదలుపెట్టాడు. ముష్టియుద్ధము నకు సిద్ధము కమ్మని చేయి పట్టుకొని లాగినాడు. అప్పటికీ కృష్ణుడు చిరునవ్వునే ప్రదర్శిస్తున్నాడు. అర్జునుడు మెల్లగా కృష్ణుని దగ్గరకు చేరినాడు. కృష్ణుడు "అర్జునా! ఇది మహాసభ. యుద్ధభూమికాదు. అవివేకముతో శిశుపాలుడు మాట్లాడుతున్నాడు నీవు అతనిపై చేయి చేసుకొనకు" అన్నాడు ఈ ఘట్టమును నేటి గ్రంధాలలో శ్రీకృష్ణుడు శిశుపాలునిమీద పళ్లెము విసిరినట్లు, శిశు పాలుని కంఠము తెగిపోయినట్లు చదువుతున్నాము. ఇది పరమ అసత్యము. ఇక్కడ కృష్ణుడు ప్రదర్శించిన శాంతము లోకమునకు ఆదర్శము.

## పౌండ్రక వాసుదేవుడు

కృష్ణుని అనేక విధములుగా అనుకరించడానికి పూనుకొన్నాడు పౌండ్రకవాసుదేవుడు. కృష్ణుడేనా వాసు

## నిత్య సత్యాలు

పిరికితనంగాని, ధైర్యంగాని జాతి లక్షణం కాదు. రక్తంలో లేదు. శిక్షణలో వుంటుంది.

కుటుంబం, భార్యా బిడ్డలు, మన శరీరము, సంపద అన్నీ వాటి దోవన అవి పోయేవే. అవి మనవి కావు. మనం చేసిన మంచి పనులు, చెడ్డ పనులు మాత్రమే మన వెంట వుంటాయి.

అందర్నీ సంతృప్తి పరచాలనుకునే వ్యక్తి ఎవరినీ ఆనందపరచలేడు.

కోరికలు అనవసరంగా పెంచుకుంటూ పోవడం మహా పాపం.

జీవితం గులాబి లాంటిది. కారణం దానికి ముళ్ళుండటమే.

విత్తనం తనను తాను భూమిలో నశింపచేసు కోవడం వలననే మహా వృక్షంగా మారగలుగు తున్నది. స్వార్థ త్యాగం చేతనే జీవితంలో ఘన విజయం సాధించగలం.

కోరికయే దుఃఖమునకు, కొరతకు కారణము.

ధనం అజ్ఞానిని శాసిస్తుంది. జ్ఞానికి సేవ చేస్తుంది

ఆశించడం వలనగాక, అర్హతను కలిగియుండుట వలన దేనినైనా పొందవచ్చును.

ప్రతి వ్యక్తి మనోధైర్యం, ఆత్మవిశ్వాసం, దృఢ సంకల్పం కలిగి వుండాలి.

సుఖమును, దుఃఖమును ఒక నాణెపు ఇరు వైపుల వంటివి. సుఖమును ఆక్షేపించువారు దుఃఖమును కూడ భరించవలసినదే.

సుఖ దుఃఖములలో సమత్వముండవలెను జయాప జయములలో సమత్వముండవలెను. అట్టి వారే మోక్షమునకు అర్హులు.

## వివేకతరంగం

ఇంటికి తల్పులు మూసేస్తే
ఇంకేం కనిపిస్తుంది వీధిలో జరుగుతున్నది?
మెదడుకి కిటికీలు వేసేస్తే
ఇంకేం కనిపిస్తుంది పురివిప్పే విజ్ఞానం ?
వివేకాన్ని వెలుతురు అనలేనివారు
వివేకం గురించి వినడం మానేసి ఉంటారు !
శీతవర్షాతపాల ననుభవించని కాలం
వాయువునీ మేఘుడ్నీ సూర్యుడ్నీ
మరిచిపోయిఉంటుంది !
లోకం లోంచి వివేకం మకాం ఎత్తేసిందా ?
మరి వివేకం నుంచి విడిపోవడానికి
పేచీ పెట్టుకుంటారేం ప్రబుద్ధులు ?
పేచీకోరుల్లారా !
మీతో పేచీ పెంచుకోవడంకన్నా.
కాంతి వర్షంలో తడుస్తూ
మౌనముద్ర ధరిస్తూ
ముందుకు సాగిపోవడం మిన్న.

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

దేవుడు ? నేను కూడా వాసుదేవుడనే అని తలచి కృష్ణుని వలె వేషం వేసుకొని, కృష్ణుడు ఎక్కడకు వెళ్ళితే అక్కడకు వెళ్ళి, నేను కూడా కృష్ణుణ్ణే అని చెప్పుకొనేవాడు. ఇంతటితో ఆగక తానే నిజమైన కృష్ణుణ్ణనీ, అతడే నకిలీ కృష్ణుడని చెప్పటానికి పూనుకున్నాడు. రోజురోజుకు ఇతని చర్యలు మితిమీరి పోతున్నాయి. అనేకులు కృష్ణుని దీని అంతరార్థం అడిగినారు. కృష్ణుడు శాంతంగా, వినయంగా జవాబిచ్చాడు. " తన దేహమునకు అలంకరణ స్వతంత్రంగా చేసుకునే హక్కు ఎవరికైనా ఉంటుంది. నావలె మరొకరు అలంకరించుకో కూడదని చెప్పే అధికారం నాకులేదు. ఇట్టి విషయాలలో చర్య తీసుకొనుట సరియైనది కాదు. ఇది సరియైనదా ? కాదా ? అనే విచక్షణా జ్ఞానం వారికే వుండాలి " అన్నాడు. ఇది ఎంత వరకు మితిమీరి పోయిందంటే: పౌండ్రక వాసుదేవుడు, సత్యభామా రుక్మిణులు నా భార్యలే అనే పరిస్థితికి వచ్చింది. దీనికి కృష్ణుడు పరమ శాంతంగా " నాయనా ! ఒకరి సంసార విషయాలు ఇంకొకరు పట్టించుకొనుట చాలా తప్పు. నీ విద్వేషముతో నీ యిష్టప్రకారము ఏమైనా చేయి, కానీ స్త్రీల విషయంలో నీవు పరమ జాగ్రత్త " అని హెచ్చరించాడు. " వినాశకాలె విపరీత బుద్ధిః " అన్నట్లు అతనికి కూడా వినాశకాలము దగ్గరకు రావటముచేత ఆ స్త్రీలను తీసుకొని పోవటానికి సిద్ధపడ్డాడు. అప్పుడు కృష్ణుడు అతని పైన చేయి చేసుకోవలసిన పని ఏర్పడింది. కృష్ణుడు ఎంతో యోచించి లోక కళ్యాణమునకు పాటుపడి, చిక్కులకు, నిందలకు, నిష్ఠూరములకు గురియై, తన శాంత స్వభావాన్ని, వినయవిధేయతలను లోకానికి చాటిన మహావీరుడు.

### కర్తవ్యము

యువకులైన మీరు, భావి భారతోద్ధారకులైన మీరు, మన దేశానికి సర్వ విధముల ఆదర్శమునందించిన ఈ కృష్ణుని తత్వాన్ని గుర్తించటం అత్యవసరం. కృష్ణునిలో నున్న సర్వసద్గుణములు మనం అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాలి. అతడు స్వార్థరహితంగా, దేశ క్షేమానికై రాజుల అన్యాయ, అనాచార, అసత్యములను ఖండించి, కేవలం అర్హులైన వారికే అధికారాన్ని అప్పజెప్పి తాను కిరీటము లేని రాజుగా లోకానికి ఆదర్శాన్ని అందించినాడు. కృష్ణుని సత్య స్వరూపం గుర్తించటానికి, ఆ కృష్ణునియొక్క కాలానికి, స్థానానికి, భావానికి, సన్నిధికి చేరడానికి మనం పూనుకున్నప్పుడే అతని సత్యస్వరూపం గుర్తించే అధికారం, అవకాశం ఉంటుంది. ఐదు వేల సంవత్సరాలకు పూర్వం ఉన్న కృష్ణుని ఆదర్శములకూ, నేడున్న మన ఆదర్శములకూ రెంటికీ పోల్చ

కోవడం హాస్యాస్పదం. కృష్ణుని ఆదర్శాలను తెలిసికొనుటకు అతని కాలమునకు పోవలెను. రాజకీయంగా, సాంఘికంగా, ఆధ్యాత్మికంగా, ధార్మికంగా కృష్ణుడందించిన ఆదర్శాల కాలానికి, చరిత్ర స్థానానికి వెళ్ళినప్పుడే అతనితో సన్నిహిత సంబంధం ఏర్పడుతుంది. అతని ఆదర్శాలను తెలిసికొన్నప్పుడు వాటిని అనుసరించినప్పుడే దానికి సరియైన విలువ కట్టిన వారమవుతాం. ఆచరణలేకపోయిన కృష్ణుని అగౌరవ పరచిన వారమవుతాం. ఆదర్శాన్ని గుర్తించికూడ దానిని అనుసరించకుండా పోవడం ఏమాత్రం విజ్ఞత అనిపించుకోదు. మీ మధ్యలో ఆడుతూ, పాడుతూ ఆనందంగా పాటలతో, ఆటలతో, మాటలతో మిమ్ము ఉల్లాస పరచే సమయంలో మానవుడుగా భావించటము, మహత్తరమైన శక్తులు చూచినప్పుడు మాత్రమే మాధవుడు అనుకోటము సరియైన భక్తికి లక్షణముకాదు. ఈ దివ్యత్వమును గుర్తించి అనుసరించుటకు సర్వశక్తులు ఉపయోగించి ప్రయత్నము చేసినప్పుడే ఈ శక్తిని దక్కించుకున్న వారమవుతాం. ఆదర్శవంతమైన జీవితములనందించిన అవతారతత్త్వములను చక్కగా యోచన చేసి, పెద్దలవలన సత్యాన్ని గుర్తింప చేసికొని, చక్కగా అనుసరించుటకు పూనుకోవటము సరియైన మార్గము. అంతేకాని ఏదో చిక్కిన గ్రంథాన్ని చదివి, ఆ గ్రంథముల పవిత్రమైన విలువలను నిరర్థకం గావించుకోవటం చదువరుల లక్ష్యము కారాదు. ఏ గ్రంథాన్ని చదివినా అందులోని అంతరార్థమును గ్రహించి ఆచరణలో పెట్టండి. మహాభారతమునందున్న మాధవుని మానవత్వమును గుర్తించి, ఆ సత్యస్వరూపాన్ని మీరు గుర్తించి అనుసరించి భారతదేశమునకు శాంతి భద్రతలు అందిస్తారని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను. ★

( భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఉదకమండలం వేసవి శిబిరంలో ది 23-5-1976న చేసిన ప్రసంగంనుండి)

## నీతి మంజరి

శ్లో॥ అతిథౌ తిష్ఠతి ద్వారే
హ్యాపో గృహ్ణాతియోనరః
ఆపోశనం సురాపానం
అన్నం గోమాంస భక్షణమ్

ప. అతిథి విడచి గేస్తు డాపోశనముఁ గొన్న
నదియ మదిర పాన మన నెసంగు
కూడు మెసవెనేని గోమాంస భక్షణ
తుల్యమయి విశేష దోషమంటు

శ్లో॥ స బంధుర్యో హితైషిస్స్యాత్
స పితాయస్తు పోషకః
స సఖా యత్ర విశ్వాసః
స భార్యా యత్ర నిర్వృతిః

ప. హితముఁగోరు నెవ్వఁడతడె బాంధవుడెన్న
పెంచి సాకు వాఁడె పితరుఁడగును
విశ్వసించు నతఁడె పెలయంగ మిత్రుండు
సుఖము నందఁజేయు సుదతి భార్య

శ్లో॥ బాలార్కః ప్రేత ధూమశ్చ
వృద్ధస్త్రీ పల్వలోదకమ్
రాత్రౌ దధ్యన్న భుక్తిశ్చ
ఆయుః క్షీణం దినే దినే

ప. ప్రేతధూమంబు, బాల సూర్యాతపమ్ము
లొడల సోకుటయును, పల్వలోదకములు
త్రావుటయు, వృద్ధ భామినీ రతియు, నిశల
దధియుతాన్న భుక్తియు జీవితక్షయమ్ము

— పృథివి సుబ్బనాగయ్యకవి

# రక్షిత పక్షి రావెన్ వల్ల రైతులకు భయం




ప్రకృతిలోని పక్షులు కానివ్వండి మరే ఇతర వన్య మృగాలు కానివ్వండి విజయవంతంగా జీవించాలంటే ఆ జాతికి చెందిన జీవులు కనిష్ట సంఖ్యలో ఒక చోట నివాస ముండాలి ఎప్పుడైతే ఆ జాతి సంఖ్య కనిష్ట సంఖ్య కన్నా తక్కువకు చేరుతుందో అప్పుడు ఆ జాతి క్రమంగా అంతరించిపోతుంది. ప్రకృతిలో నివశించే పక్షులు, ఇతర వన్య మృగాలను ప్రపంచ వ్యాప్తంగా శాస్త్రజ్ఞులు జాగ్రత్తగా గమనిస్తుంటారు.

ఏదైనా ఒక ప్రాంతంలోని ఒక జాతి జీవి అంతరించిపోయే ప్రమాదం ఏర్పడినట్టు గుర్తించగానే ఆ విషయాన్ని శాస్త్రజ్ఞులు అంతర్జాతీయ వన్యప్రాణి సంరక్షణకు తెలియచేస్తారు. ఆ సంస్థ ఆ విషయాన్ని ఆ దేశ ప్రభుత్వానికి తెలియచేయుటమే కాక ఆ జీవిని కాపాడటానికి తీసుకోవాల్సిన చర్యలను కూడా తెలియచేస్తారు. ఫలితంగా ఆ దేశ ప్రభుత్వ చట్టం ద్వారా ఆ జీవి రక్షిత జీవిగా ప్రకటించబడుతుంది.

అదిగో ఆ విధంగా కెనడా ప్రభుత్వం ద్వారా రక్షిత జీవిగా ప్రకటించబడిన పక్షి రావెన్. మన ప్రాంతపు కాకికి చాలా దగ్గర బంధువు ఈ రావెన్. రూపంలోనే కాక, అలవాట్లలో కూడ రావెన్ పూర్తిగా కాకిని పోలి వుంటుంది. ఒక విధంగా దీనిని కెనడాదేశపు కాకి అనవచ్చును.

ఈ రక్షిత పక్షి రావెన్ వల్ల కెనడా దేశంలో రైతులకు భయం ఏర్పడింది. రైతులు పెంచుకునే ఆవులను రావెన్ పక్షులు వేటాడి చంపుతున్నాయి గడ్డి మేస్తున్న ఆవుల కళ్ళను తమ బలమైన ముక్కుతో రావెన్ పక్షి పొడుస్తుంది. బాధ భరించలేక కిందపడిన ఆవును రావెన్ పక్షులు సామూహికంగా పీక్కుతింటున్నాయి. దాదాపు లక్ష రూపాయిల విలువచేసే ఆవులను ఒక నెలరోజులలో రావెన్ పక్షులు పొట్టన పెట్టుకున్నాయని రైతులు గగ్గోలు పెడుతున్నారు.

ఈ రావెన్ పక్షులు చచ్చిన ఆవు మాంసాన్ని ఎక్కడో రుచి చూశాయని, ఆ రుచి మరగటం వలననే అవి ఆవుల మీదికి దండెత్తుతున్నాయని కెనడా దేశపు పక్షుల శాస్త్రవేత్త ఎలెక్స్ మిడిల్‌టన్ అభిప్రాయం వ్యక్తం చేశారు. అంతేకాక రావెన్‌ని రక్షిత జీవిగా ప్రకటించిన తరువాత ఆ పక్షుల జనాభా గణనీయంగా పెరిగిందని, దీనితో ఆ పక్షుల సహజ ఆహార పదార్థాలకు కొరత ఏర్పడి వుండవచ్చని, అందువల్ల కూడా ఈ రావెన్ పక్షులు ఆవుల వేటకు సిద్ధమై వుండవచ్చని ఆయన అంటున్నారు

ఈ రావెన్ పక్షుల సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో రైతులకు అర్థం కావటం లేదు. రావెన్ రక్షిత జీవి కాబట్టి రైతులు చంపకూడదు. చంపితే చట్టరీత్యా జరిమానా లేదా శిక్ష వుంటుంది. అలాగని రావెన్‌లను భయపెట్టి పారద్రోలటం కుదరడం లేదు. ఈ పక్షులను భయపెట్టేందుకు ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలమయ్యారు రైతులు. ఏం చెయ్యాలో దిక్కు తోచక మీరే ఏదో ఒకటి చేసి మా ఆవులను రక్షించండని అటు శాస్త్రజ్ఞులకు, ఇటు అధికారులకు అర్జీలు పెట్టుకున్నారు.

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

# ఏడాకుల అరటి

యస్. యన్. దుర్గారావు

ఇది అడవులలో నుండు పెద్దవృక్షము. ఒక్కొక్క రెమ్మకు 7 ఆకులు చొప్పున ఉంటుంది కావున దీనికి 'ఏడాకుల అరటి' అనే పేరు వచ్చింది ఆకులు బూరుగు ఆకులు వలె నుండి, సువాసన కలిగియుండును. దీని కాయలు విష్ణుకాయింత పరిమాణంలో ఉండును. పువ్వులు గుత్తులు గుత్తులుగా కాయును. పువ్వులకు ఏనుగు మదము వాసన ఉంటుంది. శరదృతువులో పూయును. ఈ వృక్షము ఎక్కడ వుంటే అక్కడి నుండి సుమారు పావు క్రోసు దూరము వరకు సువాసనలు వెదజల్లును

## వైద్యవాణి

దీని సర్వాంగాలు వైద్యానికి ఉపయోగమే. దీని రుచి పరిశీలించిన చేదుగా వుండును. త్రిదోషములును శమింప చేయును శూలలు, గుల్మములు హరించును. వాత రక్తము నిర్మూలించును సుఖ విరేచనము చేయును. జఠర దీప్తి కల్గించును. వ్రణశోధన చేయును. కానీ దీనికి వేడి చేయు స్వభావమున్నది. చెట్టుకు గంటు పెట్టిన పాలు కారును

ఏడాకుల అరటి ఆకులను మెత్తగానూరి వ్రణముల పై పూసిన మొండి వ్రణములు అరికట్టును దీని ఆకులు జిల్లేడుపాలు కలిపి పిప్పి పంటిలో వేసిన పురుగు చచ్చి బాధశమించును. ఆకుల కషాయము సేవించిన సాంద్ర మేహము నివృత్తి అగును. ఏడాకుల అరటి మ్రాను పట్ట, శొంఠి, తిప్పతీగ కలిపి కషాయము పెట్టి ఆ కషాయము త్రాగిన స్త్రీలకు స్తన్య శుద్ధియగును. పువ్వులను, పిప్పళ్ళను పెరుగుపై తేలియాడు నీటితో కలిపి త్రాగిన శ్వాస కాసలు హరించును. ఏడాకుల అరటి చెక్కను, ఆకులను కషాయము పెట్టి స్నానమునకును, పానమునకును, పైన కడుగుటకును ఉపయోగించిన కుష్ఠరోగము నివృత్తియగును. ఏడాకుల అరటిమ్రాని పట్ట కషాయం పెట్టి దానిలో తేనె కలిపి దంతములకును, నోటికి నిరాసిన - పల్లుతోము పుల్లలో పెట్టిన విషము హరించును.

దీని కషాయమును చాలా కాలము నుంచి వాడుటవలన క్వినైన్ సల్ఫేటుతో సమానంగా పని చేయును. గొప్ప గొప్ప వైద్యులు కూడ తమ అనుభవమున ఈ విషయం తెల్సుకొనిరి. ప్రత్యేకంగా క్వినైన్ సల్ఫేటును వాడినప్పుడు నిద్ర పట్టక పోవుట, చెముడు కలుగును. ఏడాకుల అరటిలో గల క్వినైన్ సల్ఫేట్‌కు ఆ దుష్పరిణామము లేదు. 

## సాటిలేని మేటి నమూనాలు

ఎక్కడపడితే
అక్కడ కనిపించే
చక్కని ఎత్తయిన కొండలు
భూమాత ధరించే పచ్చల కిరీటాలు
వాటి ముందు
అందాలరాణి పోటీలో నెగ్గే
సుందరాంగులు పెట్టుకొనే
జానా బెత్తెడు కిరీటమెంత ?
వాటికవే సాటి.
సాటిలేని మేటి నమూనాలవి
సృష్టి భూమాతకిచ్చిన నజరానాలవి.

— కమల్

సినిమా చూట్టం మానేసి ఆ కళ్ళు మధ్యమధ్యలో ఈ జంట
గమనించసాగాయి.

నెమ్మదిగా ఆ రెండు తలలు దగ్గరికి రావటం దూరంగా జరగడం, గుసగుసల వినిపిస్తున్నాయి ఆలేఖ్యకి.

" బహుశ కొత్తగా పెళ్ళయిన జంటయ్యుంటుంది " అనుకుందామె

డ్రాక్యులా టైపు పిక్చర్. మధ్యమధ్య సౌండ్ బాక్సులు తమ ప్రతాపాన్ని చూపిస్తున్నాయి.



విలన్ తను నేరం చేసినప్పుడు చూసిన అమ్మాయి కోసం వెతుకుతూ వుంటాడు. అతని కోరలు చీకట్లో కూడా తెల్లగా మెరుస్తుంటాయి.

హాలంతా నిశ్శబ్దంగా వుంది. అందరు ఉత్కంఠతతో సినిమా చూస్తున్నారు.

ఆలేఖ్య సస్పెన్స్ ఆపుకోలేనిదానిలా ముందుకు ఒంగింది.

ఆమె కళ్ళకి ' చమక్ ' మని మెరుపు మెరసి నట్లయ్యింది. ' ఏంటా ? ' అని ఇంకా ముందుకు ఒంగి చూసిందామె.

ఆ నిజాన్ని హరాయించుకోవటానికి చాలాసేపు పట్టిందామెకు. ముందర కూర్చున్న జంటలో మొగవాడు హఠాత్తుగా కత్తి తీయటం వలన వచ్చిన మెరుపని గ్రహించింది.

ఆలేఖ్య ఉచ్ఛ్వాస నిశ్వాసల వేగం పెరిగింది.

"కొంపతీసి అతడు ఆమెను చంపబోవటం లేదు గదా !" అన్న ఆలోచన ఆమెలో ప్రవేశించింది.

ఆమె ఆలోచనల్ని తల్లక్రిందులు చేస్తూ అతడు నవ్వుతూ మాట్లాడసాగాడు. అప్పుడుగాని ఆలేఖ్య గుండెలు కుదుటపడలేదు.

విలన్‌కి ఆ అమ్మాయి ఎక్కడ దాక్కుందో కనబడటంతో ఆమె వైపు ఒక్కో అడుగు ముందుకు వేస్తూ రాసాగాడు.

ఆలేఖ్య ఊహల్ని తారుమారు చేస్తూ అతను కత్తితో ఆమె కడుపులో పొడిచాడు.

అతను అంతకుముందే ఆమె నోరు మూయ్యటం వలన ఏమాత్రం శబ్దం బయటికిరాలేదు. నిస్తేజంగా ఆ యువతి తల ప్రక్కకి వాల్చేసింది.

అతను ఆమె చుట్టూవున్న తన చేతిని తీసేసి తలని ఒక ప్రక్కగా పెట్టాడు. కనురెప్పల్ని చేత్తో మూసేశాడు.

అలవాటయిన వాడిలా కర్చీఫ్‌తో చకచకా వేలి ముద్రలు తుడిచేయసాగాడు. కనీసం తల కూడా పైకెత్త లేదు.

ఆలేఖ్య గుండె ఒక్కసారి ఆగిపోయినట్లయింది. ఒక్క సెకనులో రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది.

ఒళ్లంతా చెమటతో తడిసిపోయింది.

అరికాళ్లల్లోంచి వణుకు రాసాగింది. అరుద్దామని విశ్వప్రయత్నం చేసినా చిన్న కేక కూడా ఆమె గొంతులోంచి బయటకు రాలేదు.

గొంతు ఎండిపోయినట్లయ్యింది.

ఆమె జీవితంలో మొట్టమొదటిసారిగా హత్య జరగటం కళ్లారా చూడటంతో ఆమెకి ఏం చెయ్యాలో పాలుపోలా.

(జ రి గి న క థ)

లలితతో పందెం కాసిన ఆలేఖ్య సినిమాకి వెళ్ళింది. సినిమాహాల్లోకి వచ్చిన ఒక జంటలో ఒక అమ్మాయిని ఎక్కడో చూసినట్లనిపించింది ఆలేఖ్యకి. అయితే చీకటిగా వుండటం వల్ల ఆ అమ్మాయిని గుర్తుపట్టలేక పోయింది. అయితే ఆ జంటని రెండు కళ్ళు గమనించసాగాయి.

(ఇ క చ ద వ ం డి)

ఆలేఖ్య చూపులు మాత్రం అక్కడ్నుంచి కదలటం లేదు.

అంతలో ....

అతను తల పైకెత్తి నాలుగు వైపులా చూశాడు. అదే సమయంలో ఆలేఖ్య లేద్దామని ప్రయత్నించటంతో అతని కళ్ళు ఆమె మీద పడ్డాయి.

ఆ సమయంలో అతని కళ్ళు వేటాడే సమయంలో అడ్డం వచ్చిన జంతువుని పులి చూసే చూపులా వుంది.

"అమ్మో .... అతను నన్ను చూశాడు. పారిపోవాలి" అని అనుకుంటుండే కాని ఆలేఖ్య లేవటానికి ఆమె కాళ్లు సహకరించటంలేదు.

అందరూ సినిమాలో లీనమయ్యారు.

అంతదాకా ఆ జంటనే గమనిసున్న ఆ రెండు కళ్లు కూడా సినిమా చూడటంలో మునిగేసరికి జరిగిన సంగతి మూడో కంటికి తెలియలేదు.

అతను సీట్లోంచి నెమ్మదిగా లేచి ఆలేఖ్య వైపు అడుగేశాడు

అతను ఆలేఖ్యకి మరీ దగ్గరగా వచ్చాడు.

అరుద్దామని నోరు తెరిచింది ఆలేఖ్య. ఒక్క ఉదుటున అతను ఆలేఖ్య మీదకి దూకి తన ఎడమ చేతితో ఆమె నోరు మూశాడు.

అతను తన కుడిచేత్తో ఆలేఖ్య గొంతు నులమటానికి ప్రై చేయసాగాడు.

ఆలేఖ్య గొంతు అతని చేతికి సీటుకి మధ్య నలగ సాగింది. కాని అతనికి పట్టు కుదరటం లేదు. కారణం అతని కుడి చేతికి నాలుగు వేళ్ళుండటమే. బొటనవేలు లేదు. అతని చేతులు జిగట జిగటగా వున్నాయి. పచ్చి నెత్తుటి వాసన ఆమె ముక్కును అదరగొడ్తోంది.

ఆలేఖ్యకి కనుగ్రుడ్లు బయటకొస్తున్నట్లు, ఊపిరి అందక ముక్కుపుటాలు పెద్దవిచేసింది. మెడమీద నరాలు ఉబ్బుకొస్తున్నాయి.

అతని ముఖం కర్కశంగా వుంది. కళ్ళల్లో అంతులేని కసి, ఏకైక సాక్షిని చంపాలన్న విశ్వప్రయత్నం అతని చేతల్లో కన్పిస్తోంది.

మరణానికి దగ్గర్లో ఉన్నట్లు అన్పించసాగింది ఆలేఖ్యకి.

ఆమెలో చావు ధైర్యం ప్రవేశించింది.

గబుక్కున కాలుపైకెత్తి అతని మోకాలుమీద తన్నింది.

అతనికి కొద్దిగ పట్టుసడలింది. కొద్దిగా వెనక్కివంగాడు.

అదే అదనుగా ఆలేఖ్య లేవబోయింది. అతను వెంటనే తన చేతిని కత్తిలా మడచి ఆమె మెడ మీద కొట్టాడు.

'దబ్బున' రెండు వరసల మధ్య కుప్పకూలిపోయింది ఆలేఖ్య.

అతను కొద్దిగ వంగి ఆలేఖ్యకేసి చూశాడు.

'ఒక్క దెబ్బకి రెండు పిట్టలు' అని గొణుక్కుంటూ గబగబా ఎంట్రన్స్ వైపు నడిచాడు.

ఆ రెండు కళ్ళు తన ముందు నుంచి ఎవరో వెళ్ళటం చూసి పరీక్షగా అతన్ని గమనించాడు.

అతను కంగారుగా సీట్లు దాటుకుంటూ గేట్లవైపు వెళ్ళటం గమనించాడు.

గబుక్కున ఆ రెండు కళ్లు ఆ జంట కూర్చున్నవైపు చూశాడు. ఆమె ఒక్కతే కూర్చోవడం చూసి ఆ కళ్లల్లో మెరుపు.

" Discipline in Life is More Precious than Life itself "

జీవితంకన్న
విలువైనది
నీ జీవనంలోని
శిక్షణ

— జంగా గోపాల్

పరిస్థితి అర్థమయింది. ఆకలిగా ఆమె వైపు చూశాయి

" ఏంటి మధ్యలో వెళ్తున్నాడు " అని అనుకుంటూ చుట్టూ చూశాయి. ఎవ్వరూ తన్ని గమనించటంలేదని నెమ్మదిగా ఆ వైపుకు నడిచాడు.

ఆ కళ్ళు భృగేశ్వరరావువి. అతనిలో 'ఆ' ఆలోచన మెదిలింది. భృగేశ్వరరావుకి సుమారు 35 ఏళ్ళ వయసుంటుంది. సన్నగా గెడ కర్రలా వుంటాడు.

పెళ్లి కాలేదు కాని జీవితంలో అనుభవించాల్సిన అనుభూతులన్నీ అనుభవించాడు. మాంచి రసికుడు

" అనుభవం లేని వెధవ. అందుకే మధ్యలో వెళ్లాడు. అసలు హాల్లోకి ఎంటర్ కావటంతోనే ఆమె 'ఆ' కేసేనని అర్థమయిపోయింది, అయినా వాడు ఎక్కడా చోటు దొరకనట్లు సినిమా హాలుకే తీసుకురావాలా ? అయినా ఎవడి రసికత వాడిది ? " ఆ విధంగా ఆలోచిస్తూ భృగేశ్వరరావు ఆమె దగ్గరికి వెళ్ళాడు.

అటూ ఇటూ చూస్తూ ఆమె ప్రక్క సీట్లో కూర్చున్నాడు. ఓరకంటితో ఆమెవైపు చూశాడు.

ఆమె కళ్ళు మూసుకొని వుంది.

" ఆహా ఏమి జాణతనం నన్ను చూసికూడా కావాలని చేస్తోంది " అని అనుకుంటూ ఆమె పొట్టమీద చెయ్యి వేశాడు భృగేశ్వరరావు

అంతే —

(స శే షం)

# విదురనీతి... దానధర్మములు

" న్యాయాగతస్య ద్రవ్యస్య, బోద్ధవ్యౌ
ద్వావతిక్రమౌ
అపాత్రే ప్రతిపత్తిశ్చ, పాత్రేచా
ప్రతిపాదనమ్ "

అనగా న్యాయముగా సంపాదించిన ధనమును దుర్విని యోగము చేయు మార్గములు రెండు. 1. అనర్హునికి ఇచ్చుట. 2. అర్హునికి ఇవ్వకుండుట.

మనం న్యాయంగా సంపాదించిన ధనములో కొంత భాగమును విధిగా దానం చేయవలెను. అంతేకాదు అవసరాలకు మించి దాచుకోవడం కూడా మహా పాపమని వేదవేదాంగములలో ఏనాడో చెప్పబడింది. " అదాన దోషేణ భవేద్దరిద్రః " దానము చేయనివాడు వచ్చే జన్మలో దరిద్రుడుగా పుడతాడని మన మహర్షులుచెప్పారు. " దాచుకుంటే దోచుకుంటారు " అనే లోకోక్తి కూడా వున్నది. " గౌరవం లభ్యతే దానాత్ " ధనమునకు దానం చేయుటవలన గౌరవం లభిస్తుందని అనుభవజ్ఞులు చెప్పారు. కనుక మన సంపదలో కొంత విధిగా దానం చేయవలెను.

మనం సంపాదించిన డబ్బుకు నలుగురు వారసులు ఉంటారు. 1. ధర్మము. 2. రాజు. 3. అగ్ని. 4. దొంగ. పెద్ద వారసుడైన ధర్మమునకు పెద్ద వాటా యివ్వాలి. ఆ విధంగా పెద్ద వాటా ఇవ్వకపోయినా, అసలు యివ్వకుండా అవమానపరచినచో, మిగతా ముగ్గురు వారసులైన రాజు, అగ్ని, దొంగలు అది భరించలేక కోపోద్రిక్తులై మన సంపద మీద వచ్చిపడతారు. రాజు పన్నులను విధించి కొంత ధనమును స్వాధీనం చేసుకుంటాడు. అగ్ని ప్రమాదములు సంభవించి ఆస్తికి నష్టం చేకూరుతుంది. దొంగలు దోచుకుంటారు. కాబటి ప్రతి వ్యక్తి తన సంపాదనలో విధిగా, న్యాయమైన కోటాను దానధర్మములకు సద్వినియోగం చేయాలి.

దానం చేసేటప్పుడు కూడా విజ్ఞతను ప్రదర్శించాలి. అర్హులైనవారికిమాత్రమే ధర్మం చేయాలి. అనర్హులకు దానం చేయరాదు. ఉదాహరణకు అంగవైకల్యులకు సహాయం చేయవచ్చును. యాచనే వృత్తిగా పెట్టుకొన్న వారిని ప్రోత్సహించరాదు. ఆ విధముగా చేయుటవలన సోమరితనాన్ని పెంచినవారమవుతాం. సద్వినియోగ పరచే ధర్మసంస్థలకు మాత్రమే దానం చేయాలి అపాత్రదానం చేయకూడదు. గుడిని గుళ్లో లింగాన్ని, చుట్టూ ప్రాకారాన్ని మింగే ఆషాఢభూతులకు దానం చేయరాదు. అటుల చేసినయెడల మనం యిచ్చిన సంపద దుర్వినియోగం అయ్యే ప్రమాదం వున్నది. కనుక దానం చేసేటప్పుడు మంచిగా ఆలోచించి అర్హులైనవారికే యివ్వాలి.

ఇకపోతే న్యాయముగా సంపాదించిన ధనమునుండే దానం చేయాలిగాని, అక్రమార్జన నుండి చేయరాదు. అక్రమమార్గాలద్వారా సంపాదించిన సొమ్ము నుండి దానం చేస్తే మంచి ఫలితాలు చేకూరక పోగా చెడు ఫలితాలు చేకూరుతాయి. కనుక సంపాదించేటప్పుడు న్యాయ సమ్మతంగా సంపాదించాలి. దానం చేసేటప్పుడు కూడా సద్విని యోగం చేసేవారికే యివ్వాలి. అప్పుడు ఉభయులకు మంచి జరుగుతుంది. ఇటువంటి ఉత్తమోత్తమమైన విషయాలను మన పెద్దలు ఏనాడో ప్రతిపాదించారు. వాటిని చూడక, చూచినా ఆచరణలో పెట్టలేకపోవడం దురదృష్టకరం. ఈ పరిస్థితి మారాలి. మారినప్పుడు దేశం సుఖశాంతులతో విలసిల్లుతుంది.

— కొమరగిరి

# నవ్యావతారము - దివ్యప్రేమ - భవ్యభక్తి

"వన్దేఽహం సాయినం దేవం ప్రేమపూర్ణ
మహోదధిమ్
యత్కృపాలవలేశేన భక్తలోకః ప్రహృష్యతి"

ప్రపంచ దేశాలలో భారతదేశానికి ఒక విశిష్ట స్థానం వున్నది. అతిపురాతన కాలం నుంచీ భారతదేశం ఐహిక సుఖాల సాధనకంటే ఆముష్మిక చింత కోసమే ఎన్నో విధాలుగా ప్రయత్నం చేస్తూ వచ్చింది. ఋషులు, భారత దేశం సుఖ సంపదలతో, ఆధ్యాత్మిక చింతతో నిరంతరం ఉత్తమంగానూ ఉన్నతంగానూ ఉండేటట్లు అనేక విధాలుగా తమ అమూల్య సందేశాలను వినిపించివున్నారు దేశ వాసులు భోగలాలసతో భగవంతుని విస్మరించి, యధేచ్ఛగా తిరగకుండా అడుగడుగునా కర్తవ్యాన్ని బోధిస్తూనే

సామవేదం జానకిరామశర్మ

వచ్చారు. అయినా-అప్పుడప్పుడు ధర్మానికి విరుద్ధంగానూ, అధర్మానికి అనుకూలంగానూ ఋషుల బోధనలను పెడ చెవిని పెట్టి, ఘాతుక కృత్యాలకు పాల్పడుతూ దేశ ప్రజలు భగవంతుని యిచ్ఛకు వ్యతిరేకంగా నడుస్తూ వచ్చారు అలాంటి అధర్మం దేశంలో క్రూరంగా విచ్చల విడిగా తాండవించినప్పుడు, ఆ అధర్మాన్ని సమూలంగా నాశనం చేసి తిరిగి ధర్మాన్ని ప్రతిష్ఠించటం కోసం భగవంతుడు మానవ రూపాన్ని ధరించి అవతరించటం జరిగింది. ఆ విధంగా మానవ రూపం భగవంతుడు ధరించడాన్నే అవతారం ఎత్తడంగా పేర్కొన్నారు. భగవద్గీతలో కృష్ణపరమాత్మ స్వయంగా, దేశంలో ఎప్పుడు ధర్మానికి హాని సంభవిస్తుందో-అధర్మానికి అభివృద్ధి ఏర్పడుతుందో అప్పుడు ధర్మ పునరుద్ధరణకూ అధర్మ వినాశనానికీ నేను అవతరిస్తానని చెప్పటం జరిగింది.

ఆ విధంగానే భగవంతుడు ధర్మరక్షణ కోసం అవతారాలు ఎత్తుతున్నట్లు కూడా గ్రంథాలు మనకు తెలుపుతూ వున్నవి. ఇంతవరకు భగవంతుడు తెలియ జేసిన విధంగా శ్రీరామాది అవతారాలు దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయటం కోసమే అవతరించినట్లు వెల్లడి అయింది. కాలం మారింది ఇక, క్రొత్త విధానం అవలంబించి ప్రపంచ ప్రజలను ధర్మమార్గంలో నడపటానికి భగవంతుడు నిశ్చయించు కొన్నాడని విజ్ఞులు నేడు బాగా ఆలోచించి తెలియజేసే సత్యాన్ని దూరదృష్టి కలవారెవ్వరూ కాదనలేక పోతున్నారు

ఏ ప్రభుత్వమైనా తన ఏలుబడిలో వున్న ప్రజలను తన చెప్పు చేతలలో వుంచుకోవాలంటే ఆ ప్రజలకు తన పైని భయంకాని, భక్తికాని ఏర్పడేటట్లు చేయటం ఎంతైనా అవసరం. ఒక విధంగా ఆలోచిస్తే ప్రజలు భయంతో ప్రభుత్వ ఆజ్ఞలను శిరసావహించటం కంటే, భక్తితో, హృదయంతో పూనికతో, ఆజ్ఞలను నెరవేర్చటం సంతోషాన్ని కలిగిస్తుంది. ఆ విధంగా నెరవేర్చేకార్యాలలో లోటు కూడా కనిపించదు. ఈ అభిప్రాయం అందరూ అంగీకరిస్తారు. ఒక సామాన్య ప్రభుత్వం విషయంలోనే ఇలా ఊహిస్తే జగత్తును పరిపాలించే భగవంతుని విషయంలో కూడా ఈ పద్ధతి ఎందుకు ఏర్పాటు చేయ కూడదు? అనే ప్రశ్న ఉదయించటానికి అవకాశం ఉన్నది. లోక రక్షకుడూ, సర్వ జగన్నియంతా అయిన భగవంతుడు తాను పూర్వం, ధర్మరక్షణకూ అధర్మనాశ నానికీ చేపట్టిన కార్యవిధానాన్ని ఇప్పుడు ఆచరణలో పెట్టకుండా సరికొత్తదీ, ప్రజల చిత్తవృత్తికి అనుకూల మైనది అయిన నూతన విధానాన్ని బోధించి చూద్దామని అనుకొని ఆచరణలో పెట్టినట్లుగా అనిపిస్తుంది. అలా నూతన విధానాన్ని ఈ కాలంలో ఆచరణ పెట్టటం ఎంతో

ఆవశ్యకం అని వూహించికూడా ఈ పద్ధతి కార్యరూపంలో భగవంతుడు పెట్టిఉండవచ్చు.

ఏ కార్యాన్ని ఆరంభించడానికైనా సమయం రావాలి. అప్పుడు ప్రారంభించిన కార్యమే మంచి ఫలాన్ని సమకూరుస్తుంది. ఇది సాధారణ మానవులకు కూడా తెలిసిన విషయం. భగవంతునకు ఈ మాత్రం తెలియకుండా వుంటుందనుకోటం మన తెలియనితనాన్ని వెల్లడి చేయటం అవుతుంది.

ప్రపంచంలో-దేశంలో, స్వార్థం నేడు విలయతాండవం చేస్తోంది. ఆ స్వార్థాభిలాష కార్యరూపం ధరింప జేయడానికి అవలంబించే మార్గాలు అన్నీ అధర్మంతో కూడుకొన్నవే. మనోరథాన్ని నెరవేర్చుకోటమే ప్రధాన లక్ష్యంగా వున్నది. మోసం, ద్వేషం, అసహనం, చౌర్యం అసత్యం మొదలైన అన్ని క్రూర లక్షణాలూ ప్రజల్లో కాపురం ఉంటున్నవి. ఈ విధంగా పాడయిపోయిన మానవ సమాజాన్ని బాగుచేయడానికి మనుష్యులలో సాధు జీవనం అవలంబించేవాళ్ళు, ఉత్తములు ప్రయత్నించినా కుదుటపడే విధానం కనిపించదు. ఆ కారణంచేతనే భగవంతుడు సరికొత్త పద్ధతిలో-ప్రపంచంలో గల మానవ సమాజాన్ని అపమార్గం పట్టినదాన్ని, సన్మార్గానికి త్రిప్పటానికి పూనుకొన్నాడు. వెనుకటి అవతారాలకు భిన్నంగా ఒక అవతారాన్ని భారతదేశంలో మానవాకృతిలో ధరించటం సముచితంగా ఉంటుందనీ, ఈ దేశమే అలాంటి అవతారం ఆవిర్భవింపచేయటానికి అనువైనదనీ, ఆయన తలపులో మెదిలింది. అంతే - భగవంతుడు మన అదృష్టంకొద్దీ ఆంధ్రదేశంలో అనంతపురం జిల్లా పుట్టపర్తిలో జన్మించటం జరిగింది. పుట్టిన సమయంలో శ్రీకృష్ణాద్యవతారాలలో ఏర్పడ్డ మహిమాన్వితాలైన విశేషాలు ఎన్నో చోటుచేసుకున్నై. బాల్యంలోనే అతీంద్రియ శక్తులు అలవడినై. ఆ తరువాత విద్యాభ్యాస కాలంలోనూ, ఇంకా వయస్సు వచ్చిన తరువాతా అవతారమూర్తి కనబరచిన మానవాతీత మహిమలు కోకొల్లలు. ఇప్పుడు తాను వచ్చిన సనాతన ధర్మ ప్రతిష్ఠాపన విషయం విస్మరించకుండా నిరంతరం భగవానుడు సత్యసాయిబాబా పేరుతో ప్రపంచ దేశవాసులకు ధర్మబోధ చేస్తూవున్నారు.

ఈ అవతారంలో, మానవులందరూ ఒకే కుటుంబంలో వారనే సత్యాన్ని అందరూ తెలుసుకొనేటట్లు చేయటమూ,

## విజ్ఞాన వాహిని

* స్త్రీలకు హైహీల్సు వలె మగవారికి బూట్లు వలన పాదాల జబ్బులు ఎక్కువగా వస్తుంటాయి.
* ఆరోగ్యవంతులైన పెద్దల శరీరమందు దాదాపు 5 లీటర్ల రక్తము ఉండును.
* రక్తదాతలనుండి సేకరించిన రక్తమును గడ్డ కట్టకుండా చేయుటకు నిమ్మఉప్పు (sodium citrate) ను కలిపి, బ్లడ్ బ్యాంకులలో రిఫ్రిజిరేటర్ నందు 40°F, ఉష్ణోగ్రత యందుంచిన 21 రోజులవరకు చెడకుండా నిల్వ వుండును. అటుపైన నిల్వ చేయుటకు దానిని పొడి రూపములో (Freere dry Plasma) తయారు చేసి 5 సం॥ల వరకు ఉపయోగిస్తుంటారు.
* పిల్లల ప్రశ్నలకు సరియైన, సంతృప్తికరమైన జవాబులు లభిస్తే వారి మనస్సు క్రమంగా వికసిస్తుంది.
* ముతకగా కనిపించే ఎర్ర చక్కెర (Khandasari Sugar) లో ఇనుము, ఇతర విటమిన్స్ కూడా లభిస్తాయి.
* పొగత్రాగుతూ, గర్భనిరోధక మందులు నోటి ద్వారా తీసికునే ప్రతి 60 మంది స్త్రీలలో ఒకరు 50 సంవత్సరముల లోపునే గుండె వ్యాధితో మరణిస్తున్నారు.
* టీ మరుగుతుండగా యాలుక్కాయ లేదా కొంచెం శొంఠిపొడిగాని వేసి కాచి సేవించిన టీ వల్ల కలుగు దోషము కొంతవరకు నివర్తియగును

— యస్. యన్.

అ ప్రపంచ మానవులు, పరస్పరం ప్రేమ అనే దివ్య బంధంతో దగ్గరగా - ఆనందంతో, ఒకే కుటుంబంలో వాళ్ళలాగా ఉండటం చేయతగ్గ ముఖ్య కర్తవ్యంగా బాబావారికి తోచింది. అంతేకాదు - నశ్వరమైన ఐహిక వాంఛలకు దూరంగా వుంటూ, ఆముష్మిక ఆనందంకోసం- అరిషడ్వర్గాదులను దరికి చేరనీయక, సనాతన ధర్మ మతావలంబులుగా ఉండేటట్లు చేయటం కూడా ముఖ్య కర్తవ్యంగా కనిపించింది. అంతే - ప్రేమ బంధంతో మానవులు పరస్పరం సమీపవర్తులుగా వుండేటట్లూ, అలాగే సనాతన మతావలంబులు అయేటట్లూ, చేయటానికి ఇప్పటికి నలుబది సంవత్సరాలకు పైగా అనేక విధాలుగా ధర్మబోధ చేస్తున్నారు. అతిలోకములైన మహత్తులను భక్తులు ఆశ్చర్యచకితులయేటట్లు ప్రదర్శిస్తున్నారు. ద్వాపరయుగంలో శ్రీకృష్ణ పరమాత్మ ఏ విధంగా అద్భుతాలు ప్రదర్శించారో, అదే విధంగా ప్రపంచ ప్రజలను ఆకర్షిస్తూ వారందరినీ భారతీయ సనాతన ధర్మ మార్గానుయాయులుగా చేస్తూ, మహత్తులను ఎన్నో ప్రదర్శిస్తున్నారు. ముఖ్యంగా ప్రేమ ఏర్పడేటట్లూ దానిని ఆచరణలో పెట్టేటట్లు చేస్తూ, సనాతన ధర్మ పథాన్ని త్రికరణశుద్ధిగా అవలంబించేటట్లు ఆశ్చర్యం కలిగేవిధంగా మార్పు ప్రజల్లో కలిగేటట్లు చేస్తున్నారు.

ప్రేమ అనే పదం రెండక్షరాలతో కూడుకొన్నది. దాని మహిమ మాత్రం అనంతం. ప్రేమ ధర్మనిర్వహణ కోసం పుట్టింది. అది జీవిత ధర్మంగా రూపుదిద్దుకోవాలి. ప్రేమ మమతావలంబకులకు శాంతి సుఖాలు కరతలామలకాలు అవుతవి. నిర్వ్యాజమైన ప్రేమ జీవాత్మలను ఒకచోటికి చేరుస్తుంది. ఆనందంతో బంధిస్తుంది. స్వచ్ఛమైన ప్రేమతో తలపెట్టిన ఎంత పెద్ద కార్యమైనా అద్భుతంగా నెరవేరుతుంది. లోకంలో ప్రేమకంటె ఉత్తమమైన ధార్మికగుణం లేదు. ఉత్తమమైన మతంలేదు. స్వార్థరహితమైన ప్రేమతో సర్వజీవులనూ ప్రేమించటం సాక్షాత్తూ నారాయణుని సేవించటమే అవుతుంది. దానినే దివ్యప్రేమ అని అనవచ్చు. అదే మోక్షాన్ని చేరువకు తెస్తుంది. స్వార్థంతోకూడిన ప్రేమ సంసారబంధం ఏర్పాటు చేస్తుంది. స్వార్థరహితమైన ప్రేమ ఆనందానుభూతిని కలిగిస్తుంది. ప్రేమ, త్యాగంతో కూడినది అయితే, సేవాభావంతో విలసిల్లితే-దానిమహిమ అనిర్వాచ్యం అవుతుంది. ఇంత ఎందుకు ? ప్రేమ బదులు కోరరాదు. అతి పవిత్రమైనది కావాలి. అలా అయినప్పుడు ప్రేమించేవారికీ, ప్రేమింపబడేవారికీ ఇట్టిదని చెప్పటానికి వీలులేని మహానందం కలుగుతుంది. స్వార్థంతో కూడినదీ, అపవిత్రమైనదీ - అర్థ్రిభావరహితమైనదీ – అయిన ప్రేమ ఆత్మానందాన్ని సృష్టించటం కల్ల

ఇతరులకు సంతోషం కలిగే విధంగా ప్రవర్తిస్తూ - ప్రేమిస్తూ ఉండటం తనజీవితంలో మానవుడు చేసినమహా కార్యంగా భాసిస్తుంది. అటువంటి సమయంలో అనుభవించే ఆనందమే స్వచ్ఛమైన పరమానందంగా ప్రకాశిస్తుంది. ఇతరుల బాధ నీ బాధగా ఇతరుల సంతోషం నీ సంతోషంగా అయి నిష్కళంకమైన, నిర్వ్యాజమైన ప్రేమతో వారికి సంతృప్తి కలిగించిననాడు నీవు పొందే ఆనందానికి అవధి వుండదు. నిన్ను ద్వేషించిన వారిని కూడా ప్రేమించటమే ఉత్తమమూ ఉన్నతమూ అయిన ప్రేమ అవుతుంది. దానాలూ ధర్మాలూ, వ్రతాలూ, నిష్కల్మష ప్రేమకు సాటిరావు. ప్రపంచ మానవులందరూ తనకు సోదరులుగా భావిస్తూ వారికోసం ఎంత త్యాగాన్నయినా చేయటానికి సిద్ధపడి, వారిని ప్రేమించటం తన ధర్మంగా భావించి, ఏ కారణమూ లేకుండా సర్వాత్మనా వారిని ప్రేమింటమే విశ్వప్రేమ అవుతుంది

ఈ విధమైన ప్రేమను ప్రపంచానికి బోధించటానికే భగవంతుడు నవ్యావతారమైన సత్యసాయిబాబా రూపం ధరించి, ప్రపంచ ప్రజలకు అద్వితీయ సందేశాన్ని అందిస్తున్నారు. మోక్షసాధన ప్రయత్నంలో జీవకోటి యెడల ప్రేమ, దయ చూపించటం ఎంత ముఖ్యమో, భగవంతుని అంతకంటే వేయిరెట్లు భక్తి ప్రపత్తులతో ఏకాగ్రచిత్తంతో, సేవించటం ధ్యానించటం ముఖ్యమని

అందరికీ తెలిసిన విషయమే. బాబావారు ప్రపంచ ప్రజల్లో భక్తి బీజాలు ఏనాటి నుంచో వెదజల్లుతున్నారు. ప్రేమ, భక్తి కలిగివుంటే భగవంతుడు భక్తులను వెతుక్కుంటూ దగ్గరకు వస్తాడు.

భక్తియోగాన్ని ప్రత్యేకంగా విశదీకరించిన భగవద్గీత గానీ, భాగవతంగానీ భక్తిని బోధించిన యితర గ్రంథాలు గానీ, ఒకేవిధంగా, భక్తుడు ఆచరింపవలసిన నియమ నిష్ఠలనుగూర్చీ ఏకాగ్రతనుగూర్చీ ఇంద్రియాలు విషయాల పైకి పరిగెత్తకుండా ఉండేటట్లు చేయటాన్ని గురించీ, ఇంకా అనేక ముఖ్య విషయాలను గురించీ వివరించి వున్నై.

ఈ భక్తియోగం జ్ఞానయోగంతో పోల్చినప్పుడు భక్తునకు ఆచరించటానికి తేలికగా కన్పిస్తుంది కానీ, ఇందులో కూడా నియమపాలనం, చిత్త ఏకాగ్రత సంపాదించటం మొదలైనవి భక్తుణ్ణి పరీక్షకు లోనుచేస్తాయి. భక్తుడు తనకు మానవ శరీరం అనుగ్రహించిన భగవంతుని యెడల కృతజ్ఞతతో వుండి, ఆయన పైని అనురాగం, ప్రేమ, భక్తీ, కుదుర్చుకోవాలి. భగవంతుడు దయా సముద్రుడు మనకు దగ్గరవాడు. నిరంతరం మన యోగ క్షేమాలు చూస్తూ వుంటాడు భక్తసులభుడు అనే భావంతో ఆయన పైని అచంచలమైన విశ్వాసం కుదుర్చుకోవాలి. క్రమక్రమంగా, దృఢంగా, ఏర్పాటు చేసుకొన్న ఈ శ్రద్ధతో కూడిన విశ్వాసమే భక్తిగా రూపు దిద్దుకొంటుంది. అసలు భగవంతునిపై దృష్టిమరలినప్పుడు విషయ సుఖాలపై ప్రీతిలేకుండా, పట్టువిడవకుండా యత్నం చేయటం ద్వారా భక్తిని చేకూర్చుకోవటానికి వీలవుతుంది అంతేకాదు- విషయ సుఖాసక్తిపై విరక్తి కలుగుతుంది. ఆ విరక్తి క్రమంగా దేవుపై భక్తి భావాన్ని ఏర్పాటు చేస్తుంది. క్రమంగా భగవంతునిపై ఏర్పడ్డ భక్తి సాధనద్వారా అధికం కావటం, దృఢం కావటం దృఢతరం కావటం, దృఢతమం కావటం జరుగుతుంది.

భక్తసులభుడైన భగవంతుణ్ణి భక్తుడు తన ప్రభువుగా స్వామిగా ఆరాధిస్తూ స్థిరమైన తనచిత్తంలో, కదలకుండా

## ఆణిముత్యాలు

“ మనలో మాట బలం వుంటేనే ప్రపంచం వింటుంది బలం లేనప్పుడు మంచి మాటను కూడా ఎవరూ వినరు ”

– జవహర్‌లాల్ నెహ్రూ

“ ప్రేమలేని శరీరం స్మశానంలోని శవంతో సమానం. కంచరివాని తోలుతిత్తి ప్రాణం లేక పోయినా శ్వాస తీసుకుంటూనే ఉంటుంది ”

– కబీర్

“ఉన్నతస్థాయిలో ఉన్నవారు నీతివంతులై వుంటే నైతికత సమాజంలో అట్టడుగున వున్నవారికి ప్రవహిస్తుంది ; ఫలితంగా అందరికి సౌశీల్యం ఏర్పడుతుంది. శీలాన్ని క్రిందనుంచి పైకి నిర్మించలేము ; శీలాన్ని ఎప్పుడూ పైనుండి నిర్మించుకు రావాలి ”

– శ్రీ గురూజీ

“ ఇతరుల నుంచి మనం ఎన్నో పాఠాలు నేర్చుకోవచ్చు. మంచి ఎక్కడవున్నా గ్రహించు. కాని దానిని గ్రహించి నీ పద్ధతి కనుగుణంగా జీర్ణించుకో. నీవు మాత్రం అన్యుడివి కావద్దు నీవు హిందూదేశానికి దూరం కారాదు. ”

– శ్రీ స్వామివివేకానంద

“ చేతినిండా పని, మనస్సునిండా సత్సంకల్పం ఈ రెండూ వుండాలి. లేకపోతే మనస్సు కుక్కతోకలా ప్రవర్తిస్తుంది ”

– కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

ఇది సంఘటన యుగం. ఈ యుగంలో విజయం సంఘటన మీద ఆధారపడివుంటుంది. పూర్వం వ్యక్తిగతమైన గొప్పతనం వుంటే సరిపోయేది. నేడు అది చాలదు. నేడు కలిసి నడిచి, నడిపించాల్సిన అవసరం ఉన్నది ”

– శ్రీ చిన్మయానంద

మెదలకుండా ఉండేటట్లు చేయగలిగిన శక్తి సంపాదించాలి. ఆవిధమైన శక్తి సంపాదించినప్పుడు భక్తునిలో కలిగే ఆనందానికి అంతు వుండదు. మహాభాగ్యం తనకు అబ్బినట్లుగా ఆనందంతో శరీరం మఱచి గంతులు వేస్తాడు !

భగవంతుడు తన యొక్క నామాన్ని స్మరిస్తే కూడా భక్తుని అనుగ్రహిస్తాడు. కలియుగంలో నామస్మరణ చేసినంతమాత్రం చేతనే ముక్తి లభిస్తుందని పెద్దలు చెపుతున్నారు. చాలా మంది సంసారంలో పడి బాధపడుతూ వుంటారు. అలాంటి వాళ్లు మనస్సును నిగ్రహించి, సద్గుణాలు సంపాదించి పాపపుంజం భయపడి పారిపోయేటట్లుగా, బిగ్గరగా ఒడలు మఱచి నామస్మరణ చేసి కృతకృత్యులు కావాలి.

దుర్లభమైన ఈ మానవ శరీరంలో ప్రాణం వున్నప్పుడే భగవంతుని పైని భక్తి భావం గాఢంగా ఏర్పఱచుకోవాలి. భక్తులతో చెలిమి చేస్తూ సంసారంలో తామరాకు పైని నీటిబొట్టు అంటని విధంగా వుండాలి. క్షణిక సుఖాలకై ప్రాకులాడక ఏకాగ్ర చిత్తంతో భక్తిభావంతో భగవత్సేవ చేయాలి. భగవంతుణ్ణి ఆరాధించాలి. దీపం వున్నప్పుడే యిల్లు చక్కపెట్టుకోవాలి. ప్రాణం వున్నప్పుడే భగవంతుని గూర్చి ఆలోచించాలి. మనకు దేవుడు కనబడతాడా ? అనే నిరుత్సాహానికి తావు ఇవ్వకండి. భగవంతుణ్ణి ప్రత్యక్షం చేసుకొన్న ఉత్తమ భక్తులు మీకు ఆదర్శం కావాలి. మీలో విశ్వాసం దృఢంగ వున్నప్పుడు, పట్టుదల సడలనప్పుడు, భక్తి పరవళ్ళు త్రొక్కుతున్నప్పుడు, మీరుచేయలేని పని ఏదీ వుండదు. మీరు ప్రశాంత చిత్తంతో నామస్మరణ చేయండి. జపం చేయండి. ధ్యానమగ్నులు కండి అంతే_ఆ భగవంతుడే మీ దగ్గరకు వస్తాడు. ఒడలు తెలియకుండా ఏకాగ్రతతో భగవంతుణ్ణి గూర్చి మీరు ధ్యానంలో వుంటే మీరు ధ్యానం విరమించే దాకా వేచివుండి మీకు దర్శనం ప్రసాదిస్తాడు! మనకు శక్తి వున్నదా అని మీరు భక్తిని భగవంతునిపై ప్రసరింప చేయకుండా, ఉత్సాహ రహితులై కలత చెందకండి. భగవంతుని దర్శించిన వాళ్ళు, భగవంతునితో మాట్లాడినవాళ్ళు, ఆపదలలో వుండగా భగవంతునిచే రక్షింప బడిన వాళ్ళు ఎంతమందో భక్తులు ఉన్నారు. వాళ్ళు మీకు మార్గదర్శకులు కావాలి. సందేహం లేకుండా వారి అడుగుజాడల్లో మీరు పయనించండి. గడచిన నిమిషం మనది కాదు _ మనం కార్యనిమగ్నులం అయే దాకా కాలం వేచి వుండదు. మీరు భగవత్సేవను వాయిదా వేయకండి. విజ్ఞతతో పెద్దల మాటలయందు నమ్మకం వుంచి, సర్వం భగవంతునిపై మోపి భక్తి యోగంలో నిమగ్నులై భగవంతుణ్ణి దర్శించండి.

భక్తుడు తన భక్తి సముద్రమంత పెద్దదిగా చేసుకోవాలి. ఆ భక్తిసాగరంలో పడి ఈదుతూ వున్నప్పుడు అతనికి ఇతరం ఏదీ కనపడకూడదు. ఆ విధంగా సర్వాత్మనా తన సర్వస్వాన్నీ భగవంతునికి అర్పణంచేసి, ఇతరమైన ఏ కార్యం చేస్తున్నా భగవంతుడే కనపడేటట్లు చేసుకున్నప్పుడు అతనిలో దివ్యత్వం ఆవిర్భవిస్తుంది. భక్తి తరంగాలలో ఊయలలూగుతూ, వివేకంతోనూ, వైరాగ్యంతోనూ, ప్రశాంత చిత్తంతోనూ తనను తాను భగవంతునకు అర్పించుకోగలుగుతాడు. భక్తునిలో వైరాగ్యం గాఢంగా ఏర్పడ్డప్పుడే తాను చేసే ప్రయత్నాలన్నీ ఫలవంతం అవుతవి. వైరాగ్యం సులభంగా ఏర్పడదు. దానికి సువిశాలమైన ప్రాపంచిక సూక్ష్మదృష్టి నిత్యానిత్య వివేకమూ ఎంతో అవసరం. నశించిపోయే ఈ ప్రపంచాన్ని గుర్తిస్తూ, నిత్యమూ, శాశ్వతమూ అయిన భగవంతుణ్ణి ధ్యానిస్తూ, యదార్థాన్ని చూడగలిగిన శక్తి అలవరచుకోవాలి.

కొంతమంది తమకు ఏర్పఱచబడిన పవిత్ర కర్మలు ఆచరిస్తూ, అంతమాత్రం చేతనే భగవత్సాన్నిధ్యం లభ్యం కాగలదని కలలు కంటూ వుంటారు. పవిత్ర కర్మలు ఆచరించటం, దానధర్మాలు చేయటం ఉత్తమ కార్యాలే కాగలవు. అయితే - ఆ కర్మలు ముఖ్యంగా చిత్తశుద్ధి ఏర్పడటానికి మాత్రమే తోడ్పడగలవు. భగవద్దర్శనం మోక్షప్రాప్తి కావాలంటే, భక్తి యోగం శాస్త్రవిహితంగా ఏకాగ్రతతో ఆచరించవలసిందే !

భక్తియోగాభ్యాసానికి, ఇతరములైన ఆలోచనలు లేశమాత్రం కూడా లేకుండా చేసుకోవాలి. త్రికరణ శుద్ధిగా భగవత్సేవే చిత్త నిగ్రహంతో చేయాలి. లోపలా బయటా కూడా భగవంతుణ్ణే చూడగలగాలి. ఆ స్థితి ఏర్పడినప్పుడు భగవంతుని సాక్షాత్కారం, జన్మరాహిత్యం తప్పక కలుగుతుంది.

భక్తియోగం స్వార్థరహితమూ, వైరాగ్యయుతమూ, విశ్వవ్యాప్తమూ, అచంచలమూ, అయిననాడు తప్పక సందేహం లేకుండా జ్ఞానయోగానికి దారితీస్తుంది.

భక్తులారా ! మీరు శ్రీమన్నారాయణుడు నివసించే వైకుంఠనగరాన్ని కానీ ఈశ్వరుడు నివసించే కైలాసాన్ని గానీ చూసి వుండరు. అయితే వీటిని చూడాలని మాత్రం ఉవ్విళ్ళూరుతూ వుంటారు వైకుంఠపురం, కైలాసం ఒకేచోట పుట్టపర్తిలోనూ ఒకే స్థూల శరీరంలో శివ కేశవ రూపాలు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారిలోనూ, దర్శించి జన్మ చరితార్థం చేసుకోండి. ఆలసింపక అడ్డంకులు రాకమునుపే నేడే పుట్టపర్తికి ప్రయాణం కండి

పుట్టపర్తిలో స్వామి వేంచేసివున్న "ప్రశాంతినిలయం" దర్శించండి. అక్కడ ప్రశాంత వాతావరణంలోనే మీకు భగవంతుని దర్శనం అవుతుంది. అక్కడి భక్తులలో ఎంత భక్తి ! ఎంత పవిత్రత ! ఎంత ఏకాగ్రత ! ఎంత ప్రశాంతత! ఓహో ! ఇది శివుడు నివశించిన కైలాసం. ! అవును ! కేశవస్వామి కోరి నివసిస్తున్న వైకుంఠం.

లేత సూర్యకిరణాలు భగవంతుని ప్రసాదం ప్రశాంతి నిలయంలో ప్రసరిస్తున్నవి ! ఆ వైపున మాట్లాడకుండా, వృక్ష చ్ఛాయలలో భగవంతుడైన బాబా దర్శనం కోసం పరమ శాంతంతో కూర్చొనియున్న వేలకొలది పురుషులనూ ఇటువైపున పురుషులకు దూరంగా శరీరమంతా కళ్ళు చేసుకొని శ్రీ సత్యసాయిబాబావారి దర్శనం కోసం పిల్లలతో, బాలికలతో పిచ్చితల్లులు పురుషులను మించి - వేల సంఖ్యలో, ధ్యానైక మానసలై నిశ్శబ్దంగా రెప్పవేయకుండా చూస్తూ ఆసీనులైన మాతృమూర్తులను చూసి, భారతదేశపు ఆధ్యాత్మిక సంపద రాసులు రాసులుగా పోసినట్లు ఆనందంతో - అద్భుతమైన దివ్యనవ్యానుభూతితో భక్తులారా ! మీరు నేత్రానందంగా చూడగలరు !

మలి సాయం సంధ్యాసమయానికి ముందే - అదే ప్రశాంతత ! అదే దివ్య దర్శనం ! పురుషులలో కానీ - స్త్రీలలో కానీ - ఉదయం భగవంతుణ్ణి దర్శించి వున్నాము కదా అనే తృప్తి లేదు. కాషాయాంబరధారియై నీల కేశజాలం విప్పిన నెమలిపురిలాగా వింత కాంతు లీనుతుండగా, ఆదేదో లోకంలో వాళ్ళతో ఆజ్ఞాపిస్తూ, కరచాలనం చేస్తూ వున్నట్లుగా, మందగమనంతో మందహాసంతో భక్తుల ముందూ భక్తురాండ్రముందూ వ్యత్యస్త పాదారవిందుడైన కృష్ణభగవానుని తలపిస్తూ, నృత్తానుకూలుడైన నటరాజును తలపిస్తూ ఉంటారు వారివారి అభీష్టాలను పొందుపరుస్తూ ఇచ్చిన పత్రాలను అందుకొంటూ, ఆశించినవారికి

## సుమం, గీతం

కలాల లతలకి విరబూసే
సౌజన్య సౌగంధికా సుమాలను
ఏరుకొండి !
కలాల వీణపై వినిపించే
సౌందర్య అనురాగ గీతాలను
పాడుకొండి ! !
ఆ సుమాలు
ఎన్నడూ వాడనివి.
పరిమళాలు వీడనివి -
ఆ గీతాలు
ఎన్నడూ ఆగనివి,
శ్రుతిలయలు తప్పనివి.

— వేదాటి రఘుపతి

సుగంధంతో కూడిన విభూతిని సృష్టించి యిస్తూ వుంటారు. అష్ట భక్తులను పలకరింతలలో ఆనందింపజేస్తూ, ఆర్తులనూ జిజ్ఞాసువులనూ సంభాషణకు ఆహ్వానిస్తూ - ప్రతి భక్తునియందూ భక్తురాలియందూ, భగవంతునితో తాదాత్మ్యం చెందిన మధుర భావోద్రేకాన్ని సృష్టిస్తూ, తిరిగి తన ప్రాసాదంలోనికి వెడుతూ వున్నప్పుడు, దివ్య మంగళవిగ్రహం చూడలేకపోతామే అనే దిగులుతో - సూర్యాస్తమయ సమయంలో, ముకుళించిన ముఖ పద్మాలతో తనుతమ తావులకు వీడలేక వీడలేక విడిచి వెళ్ళే భక్తకోటిని హృదయంతో దర్శింపగలిగినవారికి, పునర్జన్మ ఉంటుందా అనే సందేహం కలగక మానదు.

భక్తగణానికి ప్రాతస్సాయం సమయాలలో దర్శనం యిచ్చినతరువాత, స్వామి సమక్షంలో జరిగే సంకీర్తనము - కృష్ణస్వామి బృందావనంలో భక్తకోటి మధ్య చేసిన, మధురాతి మధురమైన దివ్య సంకీర్తనగా భాసిస్తుంది.

ప్రాతస్సాయం సంధ్యలలో బారులు తీర్చి కూర్చున్న ఆ వరుసలలో, అన్ని మతాలవాళ్లూ, అన్ని కులాలవాళ్లూ కనబడతారు. సర్వమత సమ్మేళనం, సర్వవర్ణ సమ్మేళనం ఇక్కడ కనబడినట్లుగా మరి యే పుణ్యతీర్థాలలోనూ కనబడదు అందరి ముఖాలలోనూ ఆనంద రేఖలు తాండవిస్తూ వుంటై. ప్రక్క-ప్రక్కల కూర్చున్న వివిధ మతాలవాళ్లందరూ నిజంగా ఒకే మతానికి చెందిన వాళ్లే! సంకుచితత్వం చోటు చేసుకొన్న వాళ్లలోనే ఈ మత మౌఢ్యమూ, కులాల వెఱ్ఱీ కనబడుతుంది. ఇక్కడకు చేరిన వాళ్లందరిదీ ఒకే మతం! భక్తిమతం. వాళ్ళందరిదీ ఒకే కులం భక్తికులం! ఈ భక్తులందరూ ఎక్కడినుంచి వచ్చారు? వీరందరికీ బాబా సందర్శనోత్సుకతలో ఎంతో దూరం ఎంతో దగ్గర అయింది! వ్యయప్రయాసలు బాబా సన్నిధిలో వెలిగించిన హారతి కర్పూరంలా అదృశ్యం అయినై.!

అమెరికానుంచి వచ్చిన భక్తుడూ, అలాగే ఇంగ్లాండు నుంచీ - తాయిలాండ్, జర్మనీ, సింగపూర్, మలేసియా, చైనా మొదలైన దేశాలనుంచీ, వచ్చిన భక్తులందరూ ఒకే విధంగా ఎందుకు కనబడుతున్నారు? అందరిదీ ఒకే భావన! దేవుణ్ణి చూడగలిగామనే దివ్యభావన! అందరిదీ ఒకే ధ్యేయం. ఎంత ప్రయత్నించినా భగవంతుణ్ణి చూడలేని మనం, కలలో కాకుండా - నిజంగా చూసి నమస్కారాలు అర్పించే భాగ్యం పొందుతున్నామనే తాదాత్మ్య స్థితితో కూడిన భవ్యభావన! వీళ్లందరిదీ ఒక భాష కాదే! ఎలా ఇన్ని దేశాలనుంచి కూడబలుకుకొని వచ్చినట్లుగా ఇక్కడకు వచ్చారు? ఎలా వచ్చారా వాళ్లందరి హృదయాలూ పరస్పరం అంతర్గతంగా భాషించుకొన్నవి! ఆ భాష హృదయైక భాష! హృదయంతో కొంతమంది చూస్తారు. హృదయంతో కొంతమంది మాట్లాడతారు! వీరందరూ ఆ విధమైన దివ్య హృదయ భాషను అర్థం చేసుకోగల నవ్యాతినవ్య భాషా శాస్త్రవేత్తల సంఘానికి చెందినవారే! అదేమిటి? పలు దేశాలనుంచి వచ్చిన స్త్రీ పురుషులు ఆంధ్రదేశ వాసులుగా మారిపోయినారేమిటి? అంతేకాదు వారు ధరించిన వస్త్రాలలో హృదయాలలోని పవిత్రత, స్వచ్ఛంగా ధవళంగా భాసిస్తూ వున్నదిసుమా! పొడుగైన లాల్చీలూ, పైజమాలూ ధరించి గంభీరమైన మానవాకృతులతో వున్న దివ్యులుగా భాసిస్తున్నారే! స్వార్థ రహితమూ, సంయమనమూ గల చిత్తవృత్తులతో కూడిన హృదయాలు బాబావారికి అర్పించి, ఉత్కంఠతో నిరంతరమూ ఆ భగవంతుని దర్శనాన్ని కాంక్షిస్తున్నారు.

ఆహా! ఏమి ఈ అత్యద్భుత మహిమాన్విత దివ్యసృష్టి! బాబా తాను పరమేశ్వరుడననీ ప్రపంచ సృష్టికర్తననీ చెప్పకుండా చెపుతున్నట్లుగా ఎంతమంది తెలుసుకోగలుగుతున్నారు? బాబా మహిమలూ లోకోత్తర సృష్టి ఎంతమందికి యథార్థ భావ విలసిత సత్యాన్ని తెలియజేయగలుగుతున్నవి? అల్పమైన నా శక్తిని ఆధారంగా తీసుకొని, అనిర్వాచ్యుడూ-అమృత హృదయుడూ ప్రేమావతారుడూ అయిన భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారిని గూర్చి చెప్పబూనటం తెలివి తక్కువతనం కాదని ఎవరూ చెప్పలేరు. భక్తులారా! ఆత్మరూపులారా! ఆలసించకండి. సంసార సముద్రాన్ని తేలికగా దాటించటానికి అవతరించిన బాబావారిని దర్శించి, దానివల్ల మీలో ఏర్పడ్డ భక్తిని దృఢతమం చేసుకొని జన్మ మృత్యువుల సందోహం రాకుండా, లేకుండా చేసుకొని పునరావృత్తి రహిత బ్రహ్మలోక ప్రాప్తిని చూరగొనండి ఓమ్-సాయిరామ్ ★

# మనిషి మర్చిపోలేని చర్య

మనిషి పుట్టినప్పటినించి మరణించే దాకా ఊపిరి పీలుస్తూనే వుంటాడు. ఎంత మతిమరుపు వ్యక్తి అయినా ఈ పని మాత్రం మర్చిపోలేడు. మనిషి వెన్నుపూసమీద వుండే శ్వాసని శాసించే ఓ భాగం ఇందుకు బాధ్యత వహిస్తుంది. మనిషికి తెలియకుండానే ఇది ఆపకుండా ఊపిరి తిత్తులకి నరాల ద్వారా సందేశాలని పంపిస్తుంటుంది. దాంతో గంటలో కొన్ని వేలసార్లు ఊపిరి పీల్చి వదలడం జరుగుతుంటుంది.

## మనకు తెలియని ప్రపంచం

### మల్లాది వెంకటకృష్ణమూర్తి

మెదడులో, చెవులుండే సరళరేఖలో వుండే ఓ భాగం ఉచ్ఛ్వాశనిశ్వాసలని కంట్రోల్ చేస్తుంది. ఇది మీరు విశ్రాంతిగా చదువుతున్న ఈ సమయంలో నిమిషానికి పదహారుసార్లు ఊపిరి పీల్చి వదులుతుంటారు. ప్రతిసారి ఓ పింట్ గాలిని పీలుస్తారు. అదే మీరు పరుగు పందెంలో పాల్గొన్నప్పుడు నిమిషానికి 300 సార్లు దాకా ఊపిరి పీల్చి వదులుతారు పరిగెత్తటం ఆగాక నిమిషానికి 60 సార్లకి తగ్గుతుంది అది.

శారీరకంగా జరిగే మార్పులే కాక మానసికమైన మార్పులు కూడా ఉచ్ఛ్వాస నిశ్వాసమీద తన ప్రభావాన్ని చూపిస్తుంది. ఎవరినయినా కొట్టాలనుకున్నా, పారిపోవాలనుకున్నా, భయపడ్డా, కోపం వచ్చినా, అందుకు సరిపడే శక్తి నివ్వడానికి ఊపిరి పీల్చి వదలడం అధికం అవుతుంది. ఆ విధంగా ఆక్సిజన్ రక్తానికి అధికంగా ఇవ్వబడి, రక్తంలోని కలుషిత పదార్థాలు తీసివేయబడతాయి. దాంతో అకస్మాత్తుగా శరీరానికి అదనపు శక్తి లభిస్తుంది. అలాగే బాగా జ్వరంతో మంచంమీద పడుకొని వున్నప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసలు అధికమవుతాయి.

ఆదే నిద్రలో వున్న సమయంలో నిమిషానికి 12 సార్లు మాత్రమే ఊపిరి పీల్చడం వదలడం జరుగుతుంది. నిద్రలో కలత చెందే కల వస్తే ఊపిరి పీల్చుకుని వదలడం రెట్టింపు అవుతుంది. అంటే 24 సార్లన్నమాట. మెదడులోని ఉచ్ఛ్వాస నిశ్వాసలను కంట్రోలు చేసే భాగం రక్తంలోని కార్బన్-డై-ఆక్సైడ్-ని కనిపెడుతుంటుంది. అది అధికం అయితే గాలిపీల్చి వదలడం అధికం చేసి దాన్ని తగ్గిస్తుంది.

మనం పీల్చే గాలిలో ఒక వంతు ఆక్సిజన్, నాలుగు వంతులు నైట్రోజన్, కొద్ది పాళ్ళలో కార్బన్-డై ఆక్సైడ్ ఇతరాలు వుంటాయి అయితే మనిషి శరీరం గాలిలోంచి కేవలం ఆక్సిజన్‌ను మాత్రమే తీసుకుంటుంది. శరీరానికి అవసరమైన నైట్రోజన్‌ను తినే ఆహారంలోంచి స్వీకరిస్తుంది.

మనిషి ఎంత ప్రయత్నించినా తన ఊపిరితిత్తులు నిండేలా గాలిని పీల్చుకోలేడు. కేవలం మూడొంతులు నిండేలా మాత్రమే గాలిని పీల్చుకోగలడు. ప్రకృతి ఈ సౌకర్యం ఇవ్వడం వల్లే రెండు ఊపిరితిత్తులలో ఒకటి చెడిపోతే, దాన్ని శరీరంనించి వేరు చేసినా మనిషి రెండో ఊపిరితిత్తిని మాత్రమే వుపయోగించి బ్రతక గలుగుతున్నాడు. 

చాలామంది అప్పుడే లతను చేసుకుంటామని ముందుకొచ్చారు ఆస్తినీ, అందాన్ని చూచి-

కాని లతది అదొక విచిత్ర మనస్తత్వం.

వైద్యవృత్తికి సంసార బంధనాలు అభ్యంతరమనే సిద్ధాంతాన్ని లేవదీసి బ్రహ్మచారిణిగానే వుండిపోయింది.

డాక్టర్ మదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

కొంతకాలానికామె వైద్యవృత్తిమానివేసింది. ఐనా సరే సంసారబంధనాలు తగిలించుకోలేదు బ్రహ్మచారిణిగా వున్న జీవితంలో ఆమె నిత్యనూతనమైన ఆనందాన్ని అన్వేషించసాగింది.

దానిముందు సంసార జీవితం చాలా వ్యర్థమనిపించింది.

లత స్థానిక వైద్య మండలికి అధ్యక్షురాలు.

అధ్యక్షులెప్పుడూ మంచి ధనికులుగా వుండాలికాబోలు -

ఈసారి కార్యదర్శిగా మకరంద్‌ను ఎన్నుకొన్నారు. అప్పటివరకు రాజు వుండేవాడు.

“ యువకుడు శక్తిమంతుడూ ” వుంటే అసోసియేషన్ బాగా పని చేస్తుందని మకరంద్‌ను తీసుకున్నారు- మకరంద్ ముందుగా ఈ పదవి తన వృత్తిధర్మానికి అభ్యంతరంగా వుంటుందని వాదించాడు.

లత ఇదీ నీ ధర్మంలోని ఒక భాగమేనని తన వాక్చాతుర్యంతో నచ్చచెప్పింది.

మకరంద్ అంగీకరించాడు.

అప్పటినుంచి తరచు మకరంద్ వద్దకు లత రావడం మొదలుపెట్టింది.

ఈ పరిచయాన్ని పెంచుకునేందుకే నేడు భోజనానికి పిలిచింది.

టైం చూచింది.

తొమ్మిది దాటింది అప్పుడే -

‘ సమ్మక్కా- ’

‘ అమ్మా ’

“ వెళ్ళి ఆ మకరంద్‌ను రమ్మనిచెప్పిరా పో ”

“ వారు రానన్నారమ్మా- ”

లతకు కోపం వచ్చింది. “ఎందుకని” అని సమ్మిని ప్రశ్నించడం అవమానంగా తోచింది.

తానే బయలుదేరింది.

మేడ దిగి రోడ్డుపైకి వచ్చింది.

మకరంద్ ఇంటిముందు పేషెంట్లు కాబోలు ఇంకా తిరుగుతున్నట్లున్నారు.

మెల్లగా నడుపుకుంటూ క్లినిక్ వద్దకు చేరింది. లోపలి నుండి ఏడుపులు.

మకరంద్ ధైర్యం చెపుతున్న మాటలు కూడా స్పష్టంగా వినిపిస్తున్నాయి.

ఈమె మూడ్ మొత్తమూ ఈ రోదనలతో చెడి పోయింది. లోనికి వెళ్ళి చూచింది.

బల్లపైన ఒక రోగి పడుకోబెట్టబడి వున్నాడు. అతని బంధువులు అప్పుడే వచ్చినట్లున్నారు, ఏడుస్తున్నారు ఇద్దరు ముగ్గురు.

"ఏమైంది" లత ప్రశ్నించింది.

"పేషెంట్ మరణించాడు" మకరంద్ చాలా బరువుగా చెప్పాడు.

"ఎందువల్ల"

మకరంద్ మారు మాట్లాడకుండా తాను ఇంజెక్ష నిచ్చిన మందులను తెచ్చి చూపాడు.

లత పరీక్షించింది.

"ఈ కంపెనీ కల్తీ మందులను తయారుచేసింది. ఫేమస్ కంపెనీ - నమ్మకమైన మెడికల్ స్టోర్స్ - ఇంజెక్షను ఇచ్చేసరికి రియాక్షన్ ప్రారంభమైంది. పరీక్షించేసరికి డ్రగ్ పాయిజన్ (Drug poison) అని తేలింది." మకరంద్ నుదుటి చెమటను అరచేతితో రుద్దుకున్నాడు.

"దట్స్ - ఆల్ - ఇంకేం - శవాన్ని బంధువుల కిచ్చి క్లినిక్ కట్టేసి రండి. మీ షెడ్యూల్ టైం దాటింది కదా" చాలా మామూలుగా అన్నది లత.

మకరంద్ సమాధానం చెప్పలేదు.

అతని కళ్ళలోని వెలుగులను అక్షరాలలోకి అనువదించుకోగలిగింది లత.

"యూ పూర్ మకరంద్-ఆ కంపెనీవాణ్ణి మనమేమీ చేయలేము వాడు బ్రహ్మాండమైన బిజినెస్ మాగ్నెట్ - వందలకొద్దీ ఎం. ఎల్. ఏ లను డజన్లకొద్దీ ఎం. పి. లను కొంటాడు వాడు. అలాంటి వాళ్ళ గూర్చి ఆలోచించడం

(జరిగిన కథ)

రవి వాళ్ళ ఊరు వెళ్ళిన రాణికి ఎన్నో ఎదురుదెబ్బలు తగిలాయి. రవి ఆమెని తన కూతురుకి 'అత్తగా' పరిచయం చేసే సరికి ఆమె ఆశలన్నీ కూలిపోయాయి. రవి ఆమెని అదే టాంగాలో తిప్పిపంపించేసేడు. అయితే ఆమె శరీరం మాత్రం భువనగిరి చేరింది. ఆ తర్వాత రాజుకి ఓ జాబు వచ్చింది రాణి నుంచి 'తాను ఈ లోకం నుంచి శాశ్వతంగా నిష్క్రమిస్తున్నట్లు.' లత రాణి మరణంతో దాదాపు పిచ్చివాడైన రాజు ఇంటికి వెళ్ళటం మానేసింది. ఆమె మకరంద్‌కి దగ్గర కావొస్తుంది.

(ఇక చదవండి)

వ్యర్థం. పదండి భోజనం చల్లారిపోతున్నది" ఇంగ్లీషులో అన్నది.

"అయామ్ సారీ మేడమ్ - నా కర్తవ్యాన్ని నేనెలా తప్పించుకోను? జటాయువు శక్తి కలిగి రావణుడ్ని ఎదుర్కోలేదు - మరణిస్తానని తెలిసికూడా కర్తవ్యం కోసం పోరాడింది. ఈ కంపెనీ అంతు చూస్తాను నేను"

లత నిట్టూర్చింది- "మంచిది రేపు చూచుకుందాం పదండి"

"రేపింక చూచేదేమిటి - శవ దహనం జరిగాక. ఈ రాత్రే రిపోర్టులు తయారుకావాలి. విషయమంతా అధికారుల దృష్టికి తీసుకురావాలి ...."

"నీవు కావాలని కోరికోరి బలవద్విరోధం తెచ్చు కుంటున్నావు - కొండను పొట్టేలు ఢీకొన్నట్లుంది"

"ఇలాంటి కొన్ని పొట్టేళ్ళ బలిదానం వల్లనన్నా ఆ కొండల రెక్కలు నరికే మీ కోటి మహేంద్రులు ఎప్పటికైనా దయామయులై అవతరించకపోరు"

లత ఈ మాటకు తన్ను పరిహసిస్తూ మకరంద్ అన్నట్లు భావించింది.

మారు మాట్లాడకుండా లత తన ఇంటివైపు నడిచింది.

మకరంద్ అక్కడున్న బంధువులకు చెప్పాడు. "ఇదంతా ఈ మందుల కంపెనీవల్ల జరిగింది. శవాన్ని ఇప్పుడే పోలీసుల కప్పగిస్తాను వాళ్ళు పోస్టుమార్టం చేస్తారు. ఆ రిపోర్టు వల్ల నేరస్థుడు తప్పక శిక్షింపబడుతాడు"

బంధువులు అంగీకరించలేదు. వాళ్లల్లో ఒక పెద్దాయన అన్నాడు. "మా కులంలో శవాన్ని కోయడం తప్పు – ఇలాగే తీసుకెళ్ళి సూర్యోదయంతో దహనం చేస్తాము"

"అలా వీల్లేదు ఇప్పుడిది చాలా పెద్ద మర్డర్ కేసు కిందికి మారుతున్నది. నేరస్థులను శిక్షించాలి. మీరు లొల్లి (గోల) పెట్టకండి. నేను చేసేదంతా చూస్తూ వుండండి.'

అధికమైన దుఃఖంలోనూ కోపంలోనూ కూడా మనిషి ఔచిత్యాన్ని కోల్పోవడం సహజం.

'చాల్లేవయ్యా-ఆడ చేతకానమ్మ మద్దెలపై పడ్డట్లు మనిషిని చంపి మందు బాగా లేదంటావ్' ఒకడు వ్యాఖ్యానించాడు.

ఈ మాట ఏడుస్తున్న వారి మనస్సుల్లో ఏదో కొత్త పరిణామాన్ని తీసుకొచ్చింది.

'నిజమే ఈ డాక్టరుగాడే రోగిని చంపిండు. అసమర్థుడై చంపిండు మనుషులను చంపి తినే పిశాచం వీడు.' బలవంతంగా నలుగురు మనుషులు శవాన్ని లాక్కొని బుజాలకెత్తుకున్నారు. మకరంద్ నివారించడానికి ప్రయత్నించాడు.

ఒకడు ఉద్రేకంతో, మకరంద్ చెంప ఛెళ్లుమనిపించాడు.

నరసింగరావు పోలీసుస్టేషనుకు రింగవ్ చేద్దామని డైల్ చేస్తూ మళ్ళీ ఒక్కక్షణం వెనుకాముందూ ఆలోచించాడు.

కేసు పోలీసుల దాకా పోతే పరిష్కారం మాట దేవుడెరుగును. కాని అనవసరంగా దవాఖానా మూతపడవచ్చు. చచ్చినవాడు రానూరాడు. ఆ కంపెనీపై ఎవ్వరూ చర్య తీసుకోలేరు. ఫోను కిందనే పెట్టేశాడు.

మకరంద్ ఇంకా బంధువులకు నచ్చ జెప్పే ప్రయత్నం విరమించలేదు. నరసింగరావు బలవంతంగా డాక్టర్ని గదిలోకి లాక్కొచ్చాడు..

"సింగూ ఏమిటిది–" మకరంద్ అరిచాడు. "బాస్ మీరిప్పుడు ఆవేశ పడకండి శవాన్ని వాళ్ళ సంప్రదాయాన్ని అనుసరించి చక్కగా దహనం చేసుకోనివ్వండి. సమస్యలు వాళ్ళే సరళాతి సరళంగా పరిష్కరించుకుంటున్నారు" శవంతో బంధువులు కోరంటి వెనుక దాంబర్ రోడ్ మీదుగా వెళ్ళిపోయారు.

మకరంద్ నిస్సహాయుడై చూస్తున్నాడు. నరసింగరావు మకరంద్ వున్న గదికి గొళ్ళెం పెట్టి ఇవతలకి వచ్చాడు.

ఎక్కడ అల్లరి అయితే అనవసరమైన కాంప్లికేషన్స్ (సమస్యలు) ఉత్పన్న మౌతాయోనని అతని భయం.

ఎందరు డాక్టర్లు ఎంతమందిని తెలిసో తెలియకో చంపడం లేదు. ఎందరు తమ నూతన శాస్త్రీయ విజ్ఞానాన్ని ప్రయోగించి చూచుకునేందుకు ఎక్స్పెరిమెంటలో వాడే గిన్నీ పిగ్స్‌లా మనుషులనే వాడుకోవడం లేదు? అందరూ ఈ మకరంద్‌లా గలాటా చేస్తున్నారా!

మకరంద్ ఆదర్శవాది.

నరసింగరావు యదార్థవాది.

ఆదర్శాలు అందంగా అందీ అందక వుండవచ్చు. కాని ఆచరణలో వాటి ఫలితాలు చాలా చేదుగా వుంటాయి. విషాన్ని కావాలని ఎవడు కోరుకుంటాడు?

ఏ మకరందులో తప్ప. "మకరంద్ పేరులోనే తీపి కాని కోరేదంతా చేదు బ్రతుకు" అనుకున్నాడు గట్టిగా సిగరెట్ దమ్ము పీల్చి నరసింగరావు.

(సశేషం)

పు రా ణ క థ

# గో దా న ం

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ఒకమారు ప్రయాగలో కొందరు బెస్తవారు చేపలకోసం గంగానదిలో వల విసిరారు. వల లాగే టప్పటికెంతో బరువుగా తోచింది. పూర్తిగా లాగి చూస్తే చేపలతోపాటు చ్యవన మహర్షి కూడా ఆ వలలో కనిపించారు. "ఉదవాస వ్రత" దీక్షలో వున్న చ్యవనమహర్షి పన్నెండేళ్ళపాటు నీటిలోనే వున్నారు.

బెస్తలు తమ తప్పును మన్నించవలసినదిగ చ్యవనులను ప్రతిమాలారు. "ఈ నేరానికి తగిన ప్రాయశ్చిత్త మేమో తెలుపమని ప్రార్థించారు."

"ఇందులో మీ తప్పేమీ లేదు. చేపలు పట్టడం మీ వృత్తి, మీ ధర్మం. మీ వృత్తి ధర్మాన్ని మీరు నిర్వహించారు. వలలో పడినవాటినన్నిటినీ ఎలా విక్రయిస్తారో అలాగే చేపలతోపాటు నన్నూ అమ్మివేయండి" అన్నారు చ్యవనులు.

"అయ్యో, మునీశ్వరులను చేపలతోపాటు విక్రయించడమా? ఇదేం న్యాయం?" అంటూ బెస్తలు తమ రాజైన నహుషచక్రవర్తిని ఆశ్రయించి, యీ విపత్తు నుండి కాపాడమని అర్థించారు.

ధర్మభీరువైన నహుషుడు, తన కులగురువు మరియు మంత్రులతోపాటు చ్యవనుల వద్దకు వచ్చి "మహాత్మా, యీ పరిస్థితిలో మేము ఏం చేయాలో దయచేసి సూచించండి" అని ప్రార్థించారు.

"ఎంతో కష్టపడి యీ బెస్తలు చేపలతోపాటు నన్నూ పట్టుకున్నారు. వారి శ్రమ వృథా కారాదు. నాకో వెలను నిర్ణయించి, ఆ పైకమును యీ బెస్తలకు యివ్వండి" అన్నారు చ్యవనులు.

"మహాత్మా, తమకు వెల కట్టుటయా? శాంతం పాపం" అని ప్రాధేయపడినాడు నహుషుడు. ఈ సమస్యకు పరిష్కారమేమో మంత్రులకు, గురువులకు తోచ లేదు. తుదకు గురు బృందములోని పెద్దలొకరు మహారాజుతో, "మహారాజా చ్యవనులు, మానవలోకానికే గొప్ప ఉదాహరణం. దైవసమానులు, తపస్సంపన్నులు. గోవువలె పవిత్రులు, అమూల్యమైనవారు. వారికి సరి తూగేది గోవు మాత్రమే" అన్నారు.

చ్యవనులు అందుకు అంగీకరించారు నహుష చక్రవర్తి బెస్తలకు గోదానం చేశాడు. ★

# జీ వ న గీ త ం

స్వచ్ఛత వెనుకున్న ధవళకాంతులు
ఆర్ద్రత వెన్నంటిన ఆత్మీయత
సౌరభాన్నంటుకున్న స్నేహ పరిమళం
అనుక్షణం వెన్నంటి ఉంటాయి.
నిర్మలమైన సాహిత్యోన్ముఖుడి
అంతరంగం
నిప్పులా కడిగిన ముత్యంలా
వెన్నాడుతూనే ఉంటుంది
కవి తనువు విహంగంలా ఎగిరిపోయినా
కవి సంధించిన భావుకత
మన హృదయాలలో చిరకాలం
పల్లవిస్తుంది.

—టి. శ్రీరంగస్వామి

# అ వి వే క ము

బాలవాణి

సోమంచిరామం

చాలా కాలం క్రితం ఒక ముసలివాడు, అతని మనవడు కలిసి ఒక గాడిదను తోలుకెడుతున్నారు. అలా కొంత దూరం వెళ్ళేసరికి వారికో పెద్దమనిషి ఎదురయ్యాడు "ఏం తాతా బాగున్నావా ?" అంటూ పలకరించి, "అదేంటయ్యా ! తాతా మనవళ్ళిద్దరూ తెలివితక్కువ వాళ్ళలా వున్నారే ?" అంటూ ప్రశ్నిం చాడు ఆ ముసలవానికిదేం అర్థం కాలేదు "ఏమిటి నువ్వు చెప్పేది !" అంటూ అడిగాడు.

"అదికాదు తాతా ! తెలివితక్కువ గాకపోతే గాడిదను ఊరికే నడిపించుకొని వెడతారా ఎవరైనా? హాయిగా దాని మీద ఎక్కి వెళ్ళాలిగాని" అంటూ ఓ సలహాయిచ్చాడు.

"అవును ! నిజమే ! నాకా ఆలోచన తట్టలేదు సుమా !" అనుకుంటూ ఆ తాత ముందుకు కొంతదూరం సాగిపోయాడు.

"తాతయ్యా ! తాతయ్యా ! .... ఆయన చెప్పాడుగా! గాడిదమీద ఎక్కి వెళ్లమని .... నేను ఎక్కి కూర్చుం టాను ...." అన్నాడు మనవడు.

సరేనని మనవడ్ని గాడిద పైకి ఎక్కించి ప్రయాణం సాగించాడు. కొంతదూరం పోయేసరికి మరొక పెద్ద మనిషి ఎదురయ్యాడు. "ఏరా ! కుర్ర సన్నాసీ ! ... నీకేమైనా బుద్ధుందా ? .... మీ తాత ముసలాడు కదా.... పాపం ఆయన నడవలేడు .... ఆయన్ని గాడిద మీద ఎక్కించు ...." అంటూ సలహా యిచ్చి వెళ్ళిపోయాడు.

పాపం ఆ చిన్నవాడు అదీ నిజమే ననుకుని తాను దిగిపోయి, గాడిదమీద తాత నెక్కించాడు. మళ్ళీ ప్రయాణం సాగింది.

మరికొంతదూరం సాగేసరికి ఇంకో పెద్దమనిషి ఎదురై, "ఏమయ్యా ముసలాయనా ? ఎందుకయ్యా ఏళ్ళొచ్చాయి నీకు ? .. పసివెధవని నడిపిస్తూ నువ్వు హాయిగా గాడిద సవారీ చేస్తున్నావా ? .... భలే వాడి వయ్యా ! .... ఎక్కించు .... ఎ క్కి ం చు .... ఆ పిల్లాడ్ని ...." అంటూ చెప్పేసి చక్కా బోయాడు.

"అప్పన్నా ! .... నాకు తోచనేలేదు....రా... రా!.... ఎక్కు" అంటూ మనవడ్ని కూడా గాడిదమీద కెక్కించు కున్నాడు. ప్రయాణం సాగుతోంది. కొంతదూరం పోయే సరికి మరొక మహానుభావుడు ఎదురయ్యాడు. "అయ్యయ్యో .... మీకేమైన బుద్ధుందా ? .... నోరులేని జీవం కదాని ఆ పిచ్చి గాడిద మీద మీరిద్దరూ ఎక్కి దర్జాగా ప్రయాణం చేస్తున్నారా ! ఆ జీవం బతకాలా ? చావాలా ?—దిగండి!.... దిగండి!" అంటూ వెళ్ళిపోయాడు.

"నిజమే తాతయ్యా ! పాపం ఈ గాడిద చూడు ! ఎలా ఆయాసపడుతోందో ! ...." అన్నాడు మనవడు. ఇద్దరు గాడిద దిగిపోయారు. "అప్పన్నా ! .... పాపం నడవలేక పోతోంది ...." అన్నాడు తాత. ఇంతలో మరో పెద్దమనిషి వీళ్ల మాటలు వినడం తటస్థించింది. "ఓయి వెర్రి వాళ్ళల్లారా ! దానికింత ఆలోచనెందుకు ? గాడిద ముందు కాళ్లు కట్టేయండి ! ... వెనుక కాళ్లు కట్టేయండి .... మధ్యలోంచి నీ చేతికర్ర పోనివ్వండి.... ఇద్దరూ దాన్ని కావిడిలా భుజాల్నేసుకుని తీసుకెళ్ళండి." అంటూ తాను కూడ ఓ సలహా పారేసి వెళ్లాడు.

ఇంతమంది చెప్పినట్లు చేశాక, యీయన చెప్పినట్లు చేయకపోతే ఏం బాగుంటుందీ ? .... అనుకున్నారేమో ఆ తాత మనవడు !

వెంటనే ఆ ప్రకారమే గాడిదను కట్టేసి కావిడిలా భుజాల్నేసుకుని ప్రయాణం సాగించారు. అలా కొంత దూరం వెళ్లేసరికి ఓ కాలువ మీద వంతెనెక్కారు. ఈ దృశ్యాన్ని చూసిన పిల్లలు కొంతమంది గొల్లుమని గోల చేస్తూ కేకలేయ సాగారు ఆ పిల్లల కేకలకు, గందర గోళానికి, ఆ గాడిద కంగారుపడిపోయి గిలగిలా తన్నుకో సాగింది. గాడిద తాపులకు ఎవరు ఆగగలుగుతారు ? దాంతో ఆ తాతా మనవళ్ళిద్దరూ వంతెన మీద, గాడిద కాలువలోను పడిపోయారు. అంతే !

అందరినీ తృప్తిపరచాలనుకోవడమే అవివేకము. ★

శ్రీవాణి

## పాపలం...

పాపలం ... పసిపాపలం
కన్నవారి ముద్దు బిడ్డలం
కలసి మెలసి ఆడెదం
మనసు విప్పి పాడెదం ...

తెలుగు తల్లి పిల్లలం
భరతమాత బిడ్డలం
భావిభారత పౌరులం
నవభారత నిర్మాతలం ...

వయసున మేము పిన్నలం
చదువులు నేర్చేడి బాలలం
ప్రతిభను చూపెడి మిన్నలం
భాస్కర తేజ సమానులం ...

మాతా పితరుల కన్నులం
గురువులు మెచ్చెడి శిష్యులం
పెద్దల ప్రేమకు పాత్రులం
పురాణ పురుషుల వారసులం ...

కులమత భేదాల్ మరచెదం
కలతలు మాని మెలిగెదం
స్వార్థం ... విడనాడెదం
మంచిని మమతను పెంచెదం ...

— కొమరగిరి

## అక్కా నీతో బడికొస్తా

తెల్లగ పళ్ళు తోముకొని
ఒంటికి నీరుపోసుకొని
కంటికి కాటుక పెట్టుకొని
చక్కగ తలను దువ్వుకొని
చిక్కగ పువ్వులు ముడుచుకొని
మంచి బట్టలు వేసుకొని
పలకా బలపం పట్టుకొని
అక్కా నీతో బడికొస్తా
పక్కని నేను కూచుంటా.

అ, ఆ లన్నీ రాసేస్తా
అంకెలు చాలా వేసేస్తా
అయ్యవారికి చూపిస్తా
అడిగిన కథలు చెప్పేస్తా
పాటలు కూడా పాడేస్తా
ఆటలు నేను ఆడేస్తా
అందరితోనూ కలిసుంటా
ఆనందాన్ని పంచేస్తా

— దవుల ఆంజనేయశర్మ

"జీవితంలో తన కాళ్ళమీద నిలబడే శక్తినిచ్చేదే నిజమైన విద్య. ధైర్యం, బలం క్రమశిక్షణ నేర్పేది విద్య. అన్యాయాన్ని, అధర్మాన్ని భయం లేకుండా ఎదుర్కొనే శక్తి నిచ్చేది నిజమైన విద్య. విద్యాలయాలంటే మానసిక దాస్యం, ఉద్యోగంలో దాస్యం నేర్పే జైళ్ళు కావు"

# తిరుమలలో పర్తీశ్వరుని మందిరము

" శ్రీనివాసుండు లోకైక చిన్మయుండు
వెలసె నేడు పర్తీశుడై పృథివి యందు "

పధ్నాలుగు సంవత్సరాల క్రితం చేసిన మొక్కుబడి తీర్చుకోటానికి కుటుంబంతో తిరుపతికి ప్రయాణమయ్యాం. అందులో ఎండాకాలం పెళ్ళిళ్ళ సెలవులు కొత్త దంపతుల మొక్కుబళ్ళు ఇక వేరే చెప్పాలా. రైళ్ళు బస్సులూ రద్దీ. మున్నెన్నడూ లేని నీటి కరువు. ఇవన్నీ పత్రికల్లో రోజూ పడుతూనే వున్నాయి. అయినా కలవలు కలిసి రావాలి గదా ప్రయాణమయ్యాం. మే 25 రాత్రికి కొండపైకి చేరుకున్నాం. తెల్లవారి పుష్కరిణి పుణ్య స్నానానంతరము స్వామికి అంగ ప్రదక్షిణం చేసి ఆ దివ్య మంగళ సుందర విగ్రహాన్ని మనసారా కనులారా దర్శించి ఆలయం వాకిట మెట్లపై లడ్డూ ప్రసాదాన్ని ఆరగిస్తూ కూచున్నాం. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. మసక చీకటిగా వుంది. అప్పటికే వందలాది మంది క్యూలో దైవ దర్శనం కోసం నుంచున్నారు. స్వామిని దర్శించి వచ్చిన వారుకూడా చాలామంది ప్రసాదాలను సేకరిస్తూ పండ్లూ ఫలహారాలను ఆరగిస్తూ కోతులు మీద పడకుండా ఎవరి హడావిడిలో వారున్నారు. తడిబట్టలతో కొందరు బిళ్ళగోచీలతో కొందరు పంచలవారు, లుంగీలవారు దాదాపు అన్ని జాతులవారు భాషలవారు వున్నారు.

ఈ లోగా ధ్వజస్తంభము దగ్గర కోలాహలం ముందుగా మంగళ వాయిద్యాలు వినిపిస్తున్నవి. వారి వెనుక పండితులు వేదపఠనము చేస్తూవున్నారు. గోమాతను అలంకరించి తీసుకు వెళుతున్నారు. ఇద్దరు ప్రముఖ పండితుల చేతుల్లో పెద్దపటాలకు పెద్దదండలను వేసి ఊరేగింపులో వస్తున్నారు. దూరానికి కనపడుతూనే వున్నాయి ఆ పటాలు. ఒకటి భగవాన్ శ్రీసత్యసాయి బాబా వారిది. వేరొకటి అలమేలు మంగా సహిత వెంకటేశ్వర స్వామిది. నాకు చాలా సంతోషమేసింది. కొన్ని సంవత్సరాలుగా బాబా భజనలతో స్వామి కార్య క్రమాలతో పరిచయముండటం వల్ల మా బాబా కొండ పైకి వేంచేశారా అనిపించింది. అప్రయత్నంగా సాయిరాం అని కేక వేశాను. దాదాపు 50 మంది అరటిగెలలు, పనసపండ్లు మామిడిపండ్లు బుజాలపై పెట్టుకొని వరుసగా నడుస్తున్నారు. వారి వెనుక నూట ఎనిమిది మంది స్త్రీలు దీపాలను చేతుల్లో పెట్టుకొని బారులు తీర్చి నుంచున్నారు. మూడు వందల మంది స్త్రీలు వుండవచ్చు

కామరాజు అనిల్ కుమార్

ననుకుంటాను. బాబా నగర సంకీర్తన చేస్తున్నారు. చివరగా నాలుగు వందలమంది వరకు పురుషులు మృదంగ తాళాలతో బారులు తీర్చి శ్రీసత్యసాయి నామం గానం చేస్తున్నారు. అప్పుడు అర్థమయింది అది శ్రీసత్యసాయి భక్త బృంద నగర సంకీర్తన కార్యక్రమమని. తిరుమల పుర వీధులగుండా సాగిన అది ఆ ప్రాంతములో ప్రప్రథమం. పుట్టపర్తి లాగా మారిపోయింది తిరుమల. గృహాలవాకిట హారతులిచ్చారు. మేడలపై మిద్దెలపై నిలుచుని వేలాదిమంది తిలకించారు. దేవస్థానం వారి రెండు ఏనుగులు కూడా నగర సంకీర్తనలో పాల్గొన్నాయి. అందరూ తిరిగి ధ్వజస్తంభం దగ్గరికి చేరారు. సరిగ్గా అదే సమయానికి వరాహలక్ష్మీ నరశింహ స్వామి వారికి ఛత్ర వాద్యములతో నివేదనలు యెదురైనవి. భగవాన్ బాబా మంగళహారతి నగర సంకీర్తన దిగ్విజయంగా దివ్యానుభూతుల నెల్లరకు అందించి పరిసమాప్తమయింది. తిరుమల సాయిభక్త

బృంద కార్యకర్తలు తిరుమలకు 4. కి. మీ. దూరములో నున్న జాబాలి తీర్థమందు ప్రత్యేక కార్యక్రమాల నేర్పాటు చేశారని విని అక్కడికి కూడా వెళ్ళినాము. దారి అంతా కొండలు, గుట్టలు, రాళ్లు, గుంటలు, చెట్లు పొదలు ముళ్ళకంపలు. స్వామి సంకల్పమదేమో కానీ వృద్ధులు పిల్లలు రోగులు, వికలాంగులు స్త్రీలు సహితము నడిచి వచ్చారు. ఎందరో పండితులు, పామరులు యాత్రికులు జాబాలి తీర్థానికి ఉదయం పది గంటలకు చేరారు పర్వతశ్రేణిమధ్య కొండవాగుల మధ్య ఎత్తైన మహా వృక్ష పరివేష్టితమై అలనాటి ప్రాచీన ఋష్యాశ్రమములను గుర్తుకుతెస్తూ దండకారణ్య నైమిశారణ్య వర్ణనలతో సరితూగి నిర్మల ప్రశాంత ప్రకృతి శోభతో నిండి నిబిడీకృతమై పురాణ ప్రసిద్ధమై సాధకులకు తపస్సులకు కేంద్ర స్థానమై అనుష్టాన క్షేత్రమై హనుమత్ సాక్షాత్కార సన్నిధానమైనది జాబాలి తీర్థము. ఆ ప్రకృతి రమణీయత వర్ణనాతీతము. మూడు వేల మంది యాత్రికులు, సాయి భక్తులు జాబాలి తీర్థమునకు దూర దూర ప్రాంతములనుండి చేరి యుండవచ్చును. ఋత్విక్కులు, వేద పండితులు, దేవస్థాన పూజారులు తిరుపతి దేవస్థాన అధికారులు తిరుమల స్థానిక పెద్దలు కూడా వేంచేసినారు. ఒకప్రక్క ఎత్తైన ప్రదేశములో చక్కని పర్ణశాల సమీపంలో సత్యనారాయణ వ్రతం, ఆంజనేయ స్వామి వారి దేవాలయంలో పూజలు అభిషేకములు ఆలయమునకు ప్రక్కగా హోమం, వేరొక ప్రక్క సూర్యనమస్కారములు, నవగ్రహ పూజలు రుద్రాభిషేకములు మరొక చోట లలితా సహస్రనామములు సుప్రసిద్ధ శిష్టాచార సంపన్నులైన వేద పండితులచే నిర్వహింపబడినవి. ప్రతిచోటా భక్తులు పూజా హోమాది కార్యక్రమములలో భక్తి శ్రద్ధలతో పాల్గొన్నారు. ఆ ప్రదేశం, ఆ వాతావరణం, అంతా వేద ఘోషతో, నామోచ్చారణతో మంగళ వాద్యములతో హోమాగ్నినుండి వెడలిన పరిమళ సుగంధముతో నిండినది. ప్రశాంతి నిలయమువ బాబా చరణ సన్నిధిలో

## మథనం

సాగరాన్ని మధిస్తే
ముందు వచ్చింది హాలాహలం
ఆ తర్వాత వచ్చింది అమృతం
జీవితాన్ని మధిస్తే
ముందు వచ్చింది వైరాగ్యం
ఆ తర్వాత వచ్చింది ముక్తిమార్గం.

—మారం వెంకటేశ్వర్లు

పూర్ణచంద్ర సభా మంటపంలో జరుగు దేవీ నవరాత్రి ఉత్సవములా యనిపించినవి. శ్రీరామచంద్రమూర్తి దర్శించి అనుగ్రహించి రక్షించిన ఋషివాటికలా, గోకుల బృందావనమా, ప్రాచీన భారతీయ ఋషి సత్త్రముల తపోవనములా అనిపించినది ఆ సుందరదృశ్యం. ఎల్లరకు స్వామి ప్రసాద వినియోగం జరిగింది తిరిగి భగవన్నామంతో ఎల్లరూ తిరుమలకు చేరారు. తిరుమల పర్తివాసునకు స్వాగతం పలుకుతోంది. వేంకటేశ్వరుడే సాయీశ్వరుడై వెలసెనను అనుభూతి కలిగింది. తిరుపతిలో మందిర నిర్మాణం పూర్తయింది. అల్లంత దూరం నుండే సాయీ మందిర గోపురం కన్పడుతుంది. రంగులు దిద్దుకుని కనువిందైన శోభతో మందిరం భగవానుని రాకకు యెదురుచూస్తూవుంది. "విశ్వమెల్లడల వెలయువాడు" సాయినాధుడు తిరుమల తిరుపతి క్షేత్రములో దివ్యానుభూతుల నొసగి అనేకానేకతలా విభూతి మహిమా విశేషములను భక్తులకు ప్రసాదిస్తున్నారు.

వెంకటేశ్వర పర్తీశ్వర చరణ సన్నిధికి శతకోటి ప్రణామములు. ఆ చరణాలు శ్రీ చరణాలు. జగదాభరణాలు. లోకైక శరణ్యాలు.

* * *

## తెలుగు సాహిత్య రంగంలో

# సి. పి. బ్రౌన్ ధార

ఎవరు ఈ సి. పి. బ్రౌన్ ? అతనికి తెలుగువారికి గల సంబంధమేమి ? అతడు మన తెలుగు సాహిత్యానికి చేసిన మహోపకారమేమిటి ? ఈ ప్రశ్నలు తలయెత్తడంలో అసహజం ఏమాత్రం లేదు. ఆంగ్ల ఉద్యోగిగా మన దేశానికి వచ్చి తెలుగు నేర్చుకోవడమే గాక, తెలుగు సాహిత్య సముద్ధరణకోసం శ్రమించిన సాహితీ తపస్వి. సంపాదించిన ప్రతి పైసాను కూడబెట్టి 50 వేలదాకా అప్పుచేసి, అనేక ప్రాచీన కావ్యాలను సేకరించి, అధ్యయనం చేసి, పండితుల సలహాలను తీసుకొని అనేక తెలుగు పుస్తకాలను ప్రచురించి వెలుగులోనికి తీసుకొని వచ్చిన తెలుగు వాఙ్మయోద్ధారకుడు చార్లెస్ ఫిలిప్ బ్రౌన్. ప్రామాణికమైన నిఘంటువులను, ఛందోవ్యాకరణాది గ్రంథాలను రచించి ప్రకటించిన భాషా సేవకుడు బ్రౌన్.

### ఉద్యోగం

1817 అగష్టు 4 వ తేదీన ఉద్యోగ శిక్షణకోసము మద్రాసులో అడుగుపెట్టినప్పుడు తెలుగు అక్షరాలు కూడా రాని బ్రౌన్ మూడేళ్లలో తెలుగులో గొప్ప పాండిత్యమును సంపాదించినారు. కడపలో కలెక్టర్ అసిస్టెంట్‌గా అయిదేళ్ళు పని చేసారు (1820_22; 1826_29) మచిలీపట్నం, రాజమండ్రి, గుంటూరు, చిత్తూరు, తిరుచునాపల్లిలో వివిధ హోదాలలో పనిచేశారు.

### సాహితీక్షేత్రం

ఉద్యోగం చేసినచోట్ల స్థిరాస్తులు ఏమీ సంపాదించలేదు. కడపలో మాత్రం ఒక పెద్ద బంగళా, తోట కొన్నారు. అది తెలుగు సాహిత్య కేంద్రంగా విలసిల్లింది. అది తెలుగు సాహిత్య భారతి గజ్జెలు కట్టి నాట్యమాడిన శారదామందిరం. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రముఖ పండితులెందరినో రప్పించి తెలుగు కావ్యాల సముద్ధరణకు అంకురార్పణ జరిగింది ఆ బంగళాలోనే. అప్పట్లో దానిని " బ్రౌన్ కాలేజి " అనేవారు. దానిలో పెద్ద గ్రంథాలయం నెలకొలిపారు. ఆ సాహిత్య కర్మాగారం నిర్వహణ బాధ్యతను అయోధ్యాపురం కృష్ణారెడ్డిగారికి అప్పగించారు బ్రౌన్. కడపలో సొంత ఖర్చులతో రెండు ప్రాథమిక పాఠశాలలను నెలకొలిపారు. తెలుగు, హిందుస్థాని, ఇంగ్లీషు బోధనకు తగు ఏర్పాట్లు చేశారు. అట్లే 1823లో మచిలీపట్నంలో రెండు, మద్రాసులో ఒక ' ధర్మబడి ' లను స్థాపించారు. ఈ పాఠశాలలో తమ సొంత ఖర్చుతో విద్యార్థులకు భోజన వసతి కూడా ఏర్పాటు చేయటం విశేషం.

### వాఙ్మయోద్ధరణ

" తెలుగు సాహిత్యరంగంలో తొలి పరిశోధకుడుగా, గ్రంథ సంపాదకుడుగా కీర్తింపదగినవాడు బ్రౌన్ " అన్నారు ఆచార్య జి. యన్. రెడ్డిగారు. బ్రౌన్ బహుభాషా పండితుడు. గ్రీకు, పర్షియన్, అరబిక్, సంస్కృతం తెలుగు, బెంగాలి, మరాఠి భాషలలో ప్రావీణ్యం సంపాదించారు. ప్రాచీనాంధ్ర కావ్యాలకు పునర్జన్మ విచ్చిన భాషోద్ధారకుడు. అందువల్లనే 'in 1825 I found telugu dead' అన్న బ్రౌన్ "in thirty years I raised it to life " అని చెప్పుకోవటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. ఆయన పండితుల చేత పరిష్కరింపజేయించి మొట్టమొదటిసారిగా అచ్చువేయించిన గ్రంథాలు

శ్రీ జూలూరి అప్పయ్య వ్యాఖ్యతో 1. వసుచరిత్ర (1844) 2. మనుచరిత్ర (1851) 3 పోతన భాగవతము (1848) 4. నలద్విపద (1841) అంతేకాదు కళాపూర్ణోదయము, వైజయంతీ విలాసము, పల్నాటివీర చరిత్ర, తారాశశాంక విజయము, విజయ విలాసము మున్నగు కావ్యాలను పరిష్కరింపచేసి వ్యాఖ్యలు వ్రాయించారు. బ్రౌన్ 20 కి పైగా తెలుగు గ్రంథాలను రచించాడు. అందులో ఆంధ్రగీర్వాణచ్ఛందము, తెలుగు వాచకములు, వ్యాకరణ గ్రంథాలు, అనంతపుర రాజుల చరిత్ర, తాతాచారి కథలు ఉన్నాయి. ఆంధ్రమహాభారతం 18 పర్వాలకు శుద్ధ ప్రతి తయారుచేయుటకు సొంత పైకము రు. 2714-00 ఖర్చు చేశారు. ఆదిపర్వం అచ్చు వేయించారు. హిందూ శిల్పశాస్త్రము, జ్యోతిషము, సౌందర్య లహరి, లలితోపాఖ్యానాలకు ల్యాటిన్, ఫ్రెంచి భాషలలో వ్యాఖ్యలు వ్రాశారు. ఇవన్నీ ఒక ఎత్తు. అతడు భాషకు చేసిన మహోపకారం నిఘంటు నిర్మాణం. ఇంగ్లీషు - తెలుగు నిఘంటు ; తెలుగు - ఇంగ్లీషు నిఘంటు ; జిల్లా నిఘంటు ; మిశ్రభాషా నిఘంటువులను అందించిన మహనీయుడు. 1824 లో జే. ఏ. అబేదుబాయ్ రచించిన " హిందువుల సంప్రదాయాలు - ఆచారాలు " అను గ్రంథం చదివి వేమన అను తెలుగు కవి ఉన్నట్లుగా తెలుసుకొన్నాడు. వేమన వ్రాసిన తెలుగు పద్యాలను సేకరించి 693 పద్యాలను ఇంగ్లీషులోనికి అనువదించి, ప్రచురించి, వేమన కీర్తిని, తెలుగు ఖ్యాతిని విదేశాలకు విస్తరింప చేశాడు. అనాడు తెలుగు దేశంలోని పండితులతో, విద్వాంసులతో బ్రౌన్ సాగించిన ఉత్తర ప్రత్యుత్తరాలు 20 సంపుటాల్లో (ఒక్కొక్క సంపుటిలో సుమారు 400 పుటలు) భద్రంగా ఉన్నాయి. సంస్కృతం, తెలుగు, కన్నడం, తమిళం, మళయాళం మరియు బర్మా భాషలలోని 2,240 లిఖిత గ్రంథాలను తన సొంత డబ్బుతో సేకరించి మద్రాసు సాహిత్య సంఘమునకు అందజేశారు. ఆయన తెలుగు సాహిత్య రంగానికి చేసిన సేవ, వాఙ్మయోద్ధరణకు చేసిన కృషి అపారం. ఒక

## విన్నపము

తెలుగు భాషాసాహిత్య సముద్ధరణకోసం కృషి చేసిన బ్రౌన్ దొర స్మృతిచిహ్నంగా కడపలో సి. పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్ ఏర్పాటయింది. ఆ భవన నిర్మాణంకోసం శ్రీ సి. కె. సంపత్ కుమార్ (చార్టర్డ్ అకౌంటెంట్ ) 20 సెంట్ల స్థలాన్ని దానం చేశారు. రు. 8 లక్షల వ్యయం కానున్న ఈ పథకానికి సగం ఖర్చును భరించటానికి రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించింది. బ్రౌన్ సాహిత్యాన్ని ముద్రించి ప్రచారం చేయటానికి ఈ ట్రస్ట్ కంకణం కట్టుకుంది. ఈ ట్రస్ట్ అధ్యక్ష కార్యదర్శులు శ్రీ సి. కె.సంపత్ కుమార్, శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగార్లు. వదాన్య మహాశయులు ఈ మహత్కార్యములో భాగస్వాములు అవుతారని ఆశిస్తున్నాను. పోషకులు రు. 5116/=లు, దాతలు రు. 1,116/=లు, సభ్యులు : రు. 116/=లు చెల్లించి తెలుగు వాఙ్మయోద్ధరణకు చేయూత నిస్తారని ఆశిస్తున్నాము. దాతలు ఈ క్రింది చిరునామాకు తమ సహకారం అందించ ప్రార్థన.

సి. పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్
1/23, స్టేషన్‌రోడ్, గాంధీనగర్
కడప - 516004

సం.

ఆంగ్లేయుడు ఈ విధంగా సాహిత్య కృషి సల్పడం చెప్పుకోతగ్గ విషయం. అందువలననే ఆయన తెలుగు సాహిత్య రంగంలో అగ్రస్థానాన్ని అలంకరించ గలిగాడు.

## వ్యక్తిగత జీవితం

బ్రౌన్ అవివాహితుడు. ప్రతి పైసా కూడబెట్టి, అప్పులు చేసి ప్రతి నెలా పండితులకు జీతాలు యిచ్చేవాడు. ఒక ఇంగ్లీషు వ్యాపారికి 60 వేల రూపాయిలు అప్పు క్రింద చెల్లించాడు. ఈ డబ్బంతా సాహిత్య సేవకే వినియోగించాడు ఆ రోజులలో అతనికి మూడువేల రూపాయిల దాకా జీతం వస్తుండేది ప్రతినెలా 100 నుండి 150 మంది వికలాంగులకు రు. 15 లు వంతున దానం చేసేవాడు. 34 సం మన దేశంలో ఉద్యోగం చేసి 1854లో ఇంగ్లండు చేరాడు. 1866లో తన స్వీయ చరిత్రను ముద్రించాడు. లండన్ విశ్వవిద్యాలయంలో కొంతకాలం తెలుగు ప్రొఫెసర్‌గా పని చేయటం విశేషం. తెలుగు సూర్యుడుగా ప్రస్తుతింపబడిన సి. పి. బ్రౌన్ 1884 డిశంబర్ 12 వ తేదిన అనగా తన 87 వ ఏట కన్ను మూసాడు.

— సంపాదకుడు

## జ్ఞాన నిధులు

“అతి పురాతనము, బూజుపట్టినవి అని భావించబడు చున్న గ్రంథములే నేడు మనకు జ్ఞాననిధులు. పరస్పర వైరుధ్యములను విశదీకరించి, వాని కతీతముగ వెలుగొందు దివ్యసత్యము వంకకు రాచబాటలను నిర్మించి, అందు పయనించిన భారతదేశ ఋషి పుంగవులు భగవంతుని ప్రత్యక్షముగ గాంచిరి. భారతదేశము తన ఆధ్యాత్మిక జ్యోతితో యూరప్‌నకు మార్గమును జూపు గాక !”

—Prof. J. H. FELEURE

## ప్రశ్నలు-సమాధానాలు

1. రవీంద్రనాథ్ టాగోర్ కు నోబుల్ బహుమతి వచ్చింది ఏ గ్రంథానికి ?
2. పొగాకు అత్యధికంగా ఉత్పత్తిచేసే దేశమేది ?
3. అండమాన్-నికోబార్ ద్వీప సముదాయంలో ఉన్న దీవులెన్ని ?
4. P. T. I అంటే ఏమిటి ?
5. తుపాకీ మందును ఎవరు ఎప్పుడు కనుగొన్నారు?
6. కుట్టుమిషన్‌ను ఎవరు ఎప్పుడు కనిపెట్టారు ?
7. భారతీయ కళాకారుల్లోని ‘ పన్నాలాల్ ఘోష్ ’ దేనికి ప్రసిద్ధి?
8. సూయెజ్ కాలువనెప్పుడు జాతీయం చేశారు ?
9. ‘ఫర్బిడెన్ లాండ్ ’ అని దేనిని పిలుస్తారు ?
10. గూడు నిర్మించుకొనని పక్షి (ఇండియాలోని) ఏది ?
11. ‘ జిన్నా హౌస్ ’ ఎక్కడుంది ?
12. మన రాష్ట్ర న్యాయశాఖామంత్రి ఎవరు ?
13. ‘ ఫెస్టివల్ ఆఫ్ ఆర్ట్స్ ’ ప్రతి సం॥ ఎక్కడ జరుపుతారు ?

1. గీతాంజలి 2. U.S.A 3. 223 4. ప్రెస్ ట్రస్టు ఆఫ్ ఇండియా 5. 1241 లో రోగర్ బేకన్ 6. ఐసాక్ సింగర్, 1851 లో 7. వేణువు 8. 1956 లో 9. టిబెట్‌ను 10. కోకిల 11. బొంబాయిలో 12. శ్రీ H. B. నర్సిగౌడ్ 13. ఎడింబర్గ్ (స్కాటిష్ పట్టణం)

# హాస్యావళి

## నవ్వితే నవ్వండి

సుబ్రమణ్యం ముచ్చటపడి పిల్లిగడ్డం, హిప్పీ క్రాపు పెంచుకున్నాడు కాని వేసవికాలం వచ్చేసరికి చమట పోసి చిరాకు వేస్తుండటంతో మహా ఇబ్బందిగా ఫీలవ సాగాడు.

ఇలా కాదని ఒక రోజు ఆఫీసునుండి మంగలిషాపుకు వెళ్ళి సమ్మర్ క్రాపు చేయించుకుని నున్నగా గడ్డం గోకే యించి ఇంటికి వెళ్ళాడు.

కాలింగ్ బెల్ నొక్కగానే తలుపు తీసిన భార్య ఎగిరి గంతేసి సుబ్రమణ్యంని గట్టిగా ముద్దెట్టుకుంది.

అయితే ఈ క్రాపులో అంత అందంగా వున్నానన్న మాట అన్నాడు సుబ్రమణ్యం ఆనందంగా.

అరె !! మీరా !!! మిమ్మల్నసలు నేను గుర్తు పట్టలేదండీ.

## ప్రముఖుల హాస్యం

1951 లో ఇంగ్లండులో జరిగిన ఎన్నికలలో చర్చిల్ నాయకత్వంలో కన్సర్వేటివ్ పార్టీ ఘన విజయం సాధించింది.

న్యాయశాస్త్రంలో ప్రముఖుడైన సెల్విన్ లాయిడ్ కోసం కబురుచేశాడు ప్రధాని చర్చిల్. బహుశ తనకు న్యాయశాఖ మంత్రిపదవి ఇవ్వటానికే పిలిచుంటాడు అనుకుంటూ వచ్చాడు లాయిడ్.

" నిన్ను విదేశాంగ శాఖ సహాయ మంత్రిగా నియమిస్తున్నాను " అని చర్చిల్ చెప్పగానే ఆశ్చర్యం వేసింది లాయిడ్ కి.

" అయ్యా చర్చిల్‌గారూ .... తమరేదో పొరపాటు పడినట్టున్నారు. నాకు అసలు ఒక్క విదేశీ - భాష రాదు. ఒక్కసారి కూడా విదేశీ యాత్ర చేయలేదు. ఒక్కసారి కూడా పార్లమెంటులో విదేశీ వ్యవహారాల చర్చలో పాల్గొనలేదు. పైగా నాకు ఆంగ్లేయులు కాని వారంటే మహా చిరాకు. అలాంటిది నాకు విదేశాంగ శాఖా .... " అని అనుమానం వెలిబుచ్చాడు లాయిడ్.

" అదిగో ఆ లక్షణాలవల్లనే నిన్ను ఆ శాఖకు మంత్రిని చేసింది " అన్నాడు చర్చిల్ చల్లగా.

* ఎదుగూ బొదుగూ లేనివి

1. గొర్రెతోక
2. హీరోయిన్ వయసు
3. అధ్యాపకుడి జీతం
4. తెలుగు సినిమా

— వాసు



## ప్రముఖుల హాస్యం

ఒకసారి ఓ సభలో భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు పాల్గొన్నారు. ఆయన గురించి సి. వి. భట్ మాట్లాడుతూ ' ఆయన భోగరాజు, ధర్మరాజు, దానరాజు, త్యాగరాజు' అని పొగడటం ప్రారంభించారు. పొగడ్తలు గిట్టని పట్టాభిగారు వెంటనే లేచి ' నా సంగతేమోగాని ఈయనస్వమాత్రం భట్‌రాజ్ ' అన్నారు. సి. వి. భట్‌ని ఉద్దేశించి.

- శారద



మహాత్మాగాంధి ఎక్కడికి వెళ్ళినా ఆయన్ని విలేఖరులు వదిలేవారుగాదు.

ఒకసారి ఓ విలేఖరి గాంధీజీని ' మీరు చనిపోయాక స్వర్గానికే పోతారని నమ్మకం ఉందా ? ' అని అడిగాడు. ఇందుకు ఆయన " చనిపోయాక నేనెక్కడికి పోతానో నాకు తెలియదు కాని నే నెక్కడికి వెళితే అక్కడ విలేఖరులు దొరుకుతారనే నమ్మకం ఉంది " అన్నారాయన నవ్వుతూ.

- ధరణీప్రగడ సత్యమూర్తి

# రేపటి పౌరులు

'నేటి బాలలు – రేపటి పౌరులు" అని పెద్దవారు అంటుండడం మనం తరచు వింటూనే ఉంటాం. "పౌరులు" అంటే పురంలో ఉండే ప్రజలనేనా అర్థం? అలాగయితే మిగిలినవారి సంగతేమిటి? పౌరులు ఆదర్శ వంతులు అయినప్పుడే, దేశానికీ, జాతికీ ప్రయోజనం కలుగుతుంది.

కె. ఆర్. కె. మోహన్

పిల్లలకు తొలి గురువులు తల్లీ, తండ్రీను. అందుకే "మాతృదేవోభవ", "పితృదేవోభవ". అని అన్నారు. పసితనంలో పిల్లలు తప్పటడుగులు వేస్తుంటే ముద్దుగానే ఉంటుంది. కాని భావి జీవితంలో వారు తప్పటడుగులు వేయకుండా తీర్చి దిద్దే బాధ్యత తలిదండ్రులదే. పసిపిల్లల మనసులు మైనంముద్ద వంటివి. వాటిని మనం ఏ విధంగా మలిస్తే ఆ విధంగానే రూపొందుతాయి. అందువల్ల పసితనంలోనే పిల్లలకి ఉత్తమ లక్షణాలను అలవర్చాలి. శుచీ – శుభ్రం నేర్పాలి. మంచి నడవడిక ఒరవడి దిద్దాలి. వారు స్వచ్ఛంగా సౌమ్యమైన భాషను మాట్లాడేటట్లు చూడాలి. తల్లిదండ్రులు ఈ విషయాలలో శ్రద్ధ వహిస్తే పిల్లల భావి జీవితానికి చక్కని పునాది ఏర్పడుతుంది.

బాలురు ఇల్లు దాటిన తర్వాతనే బయటి ప్రపంచంతో సంబంధం ఏర్పరచుకొనేదీ దానిని అర్థం చేసుకునేదీ. తల్లీ తండ్రీ తర్వాత దైవంతో సమానమైనవాడు గురువు. తలిదండ్రులు పిల్లల జన్మకి కారణం అయితే, గురువులు పిల్లలు మనుష్యులుగా మారడానికి కారణభూతులు అవుతారు. అందుకనే గురువు మనిషికి పునర్జన్మ ఇస్తాడని పెద్దలు అంటారు. ప్రాచీన కాలంలో గురుశిష్యుల సంబంధం ఆదర్శప్రాయంగా ఉండేది. శిష్యులకి గురువుల యెడ భక్తి, గురువులకి శిష్యులపట్ల వాత్సల్యం అపారంగా ఉండేవి. అందుకే శిష్యుల విద్యాప్రమాణాలు ఉన్నతంగా ఉండేవి. ప్రాచీన భారతదేశంలో ఎంతో ఆదర్శవంతంగా ఉండినటువంటి గురుశిష్య సంబంధాలు ఈనాడు ఎలా ఉన్నాయి? శిష్యులకి గురువులంటే భక్తి లేదు. భయం అసలే లేదు. గౌరవం మొదలే లేదు. గురువులకి కేవలం జీతాలమీదా, ప్రైవేట్లమీదా దృష్టి ఉంటోందేకాని శిష్యులకి విద్య నేర్పాలనే ఆసక్తి వుండడం లేదు. ఇలా ఎందుకు జరుగుతోంది? ఈనాటి శిష్యులే రేపు గురువులుగా వస్తున్నారు. వారు తమ గురువులవద్ద నేర్చుకున్నది లేనప్పుడు, వారి శిష్యులకు మాత్రం ఏమి నేర్పుతారు?

ఈనాడు విద్యార్థుల మనస్తత్వం ఎలా ఉంటోంది! స్కూల్‌కి వెళ్ళేది విద్య నేర్చుకోడానికి కాదు. కేవలం క్లాసులు ప్యాసయి సర్టిఫికెట్లు పొందడానికీ, తద్వారా ఉద్యోగాలు సంపాదించడానికి. క్లాసులు ప్యాసవ్వాలంటే కష్టపడి చదవాలి. అలా చదివే ఓపికా, తీరికా, ఉత్సాహమూ వారికి లేవు. అందువల్ల పరీక్షలు ప్యాసవడానికి చిట్కాలు, దొడ్డిదారులు వారు వెతుకుతారు. కొందరు తమ తలిదండ్రుల బంధువుల అధికారం, పదవి, పలుకుబడులను ఉపయోగించుకుని, పంతుళ్ళను హడలగొట్టి పైకి వస్తారు. మరికొందరు తమ అంగబలం, హంగుబలం చూపి టీచర్లను బెదరగొట్టి ముందుకు పోతారు. ఇంకొందరు టీచర్లకు "కట్నకానుకలు" సమర్పించుకొని క్లాసులను నెట్టేస్తారు. పరిస్థితులను బట్టి టీచర్లు కూడా ఉదాసీన వైఖరి అవలంబించో, వారితో కుమ్మక్కయ్యో తమ పబ్బం గడిపేసుకుంటున్నారు.

ఈ పరిస్థితులు నిజంగా ఎంతో శోచనీయమైనవి. పిల్లలు బడికి వెళ్ళేది దేనికి? కేవలం క్లాసులు ప్యాసవడానికేనా? విజ్ఞాన సముపార్జన అవసరం లేదా? కపీ కొట్టి ప్యాసయ్యేవారు ఉద్యోగ సమయంలో ఏమి చేస్తారు? ఏ

పలుకుబడితోనో దానిని సంపాదించినా అక్షరంముక్కరానివాడు దానిని ఎలా నిలబెట్టుకుంటాడు ? ఉత్పత్తి ఎక్కువగా ఉండి, జనాభా ఎక్కువగా ఉన్న ఈ కాలంలో ప్రతి చిన్న ఉద్యోగానికీ విపరీతమైన పోటీ ఉంటోంది. ఈ పోటీల్లో నెగ్గి పైకి రావాలంటే, శ్రద్ధతో కష్టపడి చదవడం అవసరం. కాపీ కొట్టి పరీక్షలు ప్యాసవవచ్చు కాని నలుగురిలో పోటీలో నిలబడి గెలవడం సాధ్యంకాదు. పోటీలో నెగ్గలేని మనిషి ఎందుకూ పనికిరాడు. నేటి బాలలు నిజంగా రేపటి పౌరులు కావాలంటే వారు శ్రద్ధాసక్తులతో చిత్తశుద్ధితో విద్యను నేర్వడం అవసరం గురువులు శిష్యులకి విద్య రావాలనే దీక్షతో కృషి చేయాలి. అప్పుడు మన దేశం నిజంగా ఆదర్శవంతమైన దేశం కాగలదు. ★

## పెద్ద సరస్సులు

* కాస్పియన్ సముద్రము (సోవియట్ యూనియన్) ఇది ఉప్పు నీటి సరస్సు. దీని వైశాల్యము 1,70,000 చ.మై.
* సుపీరియర్ (అమెరికా, కెనడా మధ్య నున్నది) ఇది మంచినీటి సరస్సు. దీని వైశాల్యము 31,820 చ.మై.
* విక్టోరియా (ఆఫ్రికా ఖండం) దీని వైశాల్యము 26,200 చ.మై.
* బైకల్ (సోవియట్ యూనియన్) ఇది మంచినీటి సరస్సు ప్రపంచంలో అతి లోతైన సరస్సు. దీని లోతు 1620మీ. దీని వైశాల్యము 11,580 చ. మై. ప్రపంచంలోని మంచినీటిలో 5వవంతు ఈ సరస్సులోనే వున్నది.

— 'విశ్వవిజ్ఞానదర్శిని' గ్రంథం

## మీకు తెలుసా ?

* 14, 15 శతాబ్దాలకు జెందిన తార్తార్ పాలకుడు తామర్లేన్ తన శత్రువుల కపాలాలతో పిరమిడ్లు నిర్మించాడు. బాగ్దాద్‌లో 1,20,000 కపాలాలతో నిర్మించిన పిరమిడ్ అతడు నిర్మించిన వాటిల్లో కెల్లా పెద్దది.
* మానవుని దేహం ఏడు సబ్బులు తయారుచేయ గలిగినంత క్రొవ్వు, ఒక చిన్న పెగ్‌కు వెల్ల వెయ్యటానికి తగినంత భాస్వరం కల్గి వుంటుంది.
* విదేశాలలో తొలి టెస్టు సెంచరీ చేసిన భారతీయ క్రికెట్ ఆటగాడు ముస్తాక్ అలీ. 1 36 లో ఇంగ్లాండులో జరిగిన సిరీస్‌లో మాంచెస్టర్ లో ఈ సెంచరీ చేశాడు.
* బోవింగ్ గన్ (ఇంగ్లాండ్) లో జాన్ హడ్ లాండ్ లిమిటెడ్‌వారు ప్రపంచంలోనే మిక్కిలి వేగవంతమైన కెమేరాను ఉత్పాదించారు. ఇది సెకండుకు 6,000 లక్షల ఫొటోలను తీస్తుంది. దీనిని ఇప్పుడు లేజరు, బాలిస్టిక్, పెటోవిక్, ప్లాజ్మా మరియు కారోనా పరిశోధనలలో ఉపయోగిస్తున్నారు.
* 'కిసోవారి' అనే పక్షి అత్యంత ప్రమాదకర మైనది. సుమారు అయిదడుగుల ఎత్తు వుండే ఈ పక్షి మనిషిని సయితం చంపగలదు !
* అలాస్కా తొలినుంచి అమెరికాకు చెందినది కాదు. 1867 లో రష్యా నుండి ఈ భూభాగాన్ని అమెరికా ప్రభుత్వం కొనుగోలు చేసింది.
* దోమ తన బరువుకు రెండింతలు మోస్తూ ఎగుర గలదు.
* లండన్ నుంచి వెలుబడే "ది టైమ్స్" వార్తా పత్రికను ఒకప్పుడు "ది డైలీ యూనివర్సల్ రిజిస్టర్" గా పిలిచేవారు.

# ఆవకాయస్తవం

పుచ్చా పూర్ణానందం

అరుణోదయం ఎరుపు, ఆంజనేయస్వామి మూతి ఎరుపు, కాకి నోరు ఎరుపు, కాళి నాలుక ఎరుపు, రక్కిసపండు ఎరుపు, రక్కసి తిండి ఎరుపు, పచ్చిపుండు ఎరుపు, కాకరపండు ఎరుపు, చిలకముక్కు ఎరుపు, చింతచిగురు ఎరుపు, కౌరివిదయ్య మెరుపు, కౌరివికార మెరుపు, పుచ్చబద్ద ఎరుపు, పగడాలు ఎరుపు, పోస్టుబాక్సు ఎరుపు, పోలీసుటోపి ఎరుపు, విప్లవవీరుల జెండాలు ఎరుపు, గోగుపువ్వు ఎరుపు, గురువిందగింజ ఎరుపు, కమలము ఎరుపు, తమలము ఎరుపు, కళ్ళకలక ఎరుపు కోపాగ్ని ఎరుపు, సంక్రాంతి గోడల జేగురు ఎరుపు, హైందవ సువాసినుల పారాణి ఎరుపు. అన్ని ఎరుపుల్ని తలదన్నె మన ఆవకాయ ఎరుపు: పేరుగాంచిన తెల్ల గులాబీలు, చిన్నరసాలు జలాలు తెచ్చి మొదటి కోతవి పల్నాటి మిర్చి తెచ్చి, ఘాటైన లంక ఆవాలు తెప్పించి కత్తిపీటలకు సానపట్టించి, పాతరోళ్ళకు కక్కు కొట్టించి పాత రోకళ్ళకు పొన్ను వేయించి, కారాలు ఆవాలు వేడ్కతో దంపించి, తాజా తిల తైలాలు సమక్షమున ఆడించి తెచ్చి పాళ్ళుతెల్సిన బామ్మల సలహాలు చక్కగా పాటించి నిష్ఠతో చేతురు త్రిలింగదేశాన ఇంటింట ఆవకాయ క్రతువు. కన్నుల పండువుగా కాంచి తీరాలి!

ఇంటి బాడుగకు, వెచ్చాలవాళ్ళకు, మరో మాసంబు వాయిదా వేసి రీజన్లు మానేసి, సీజను దాటక, ఆంధ్రుడు చెప్పిన మాట శిరసా వహించి ఆవకాయ వేయుచే ఆంధ్రయ్య ప్రథమ కర్తవ్యంబు;

పిల్లాజల్లకూ ముప్పొద్దూ కంచాలు లేపాలంటే
వేళగానివేళ అతిథు లేతెంచినా
చుట్టాలదండు దాడిచేసినా, గృహలక్ష్మికి అందుబాటు
ఆవకాయే గదండీ
రెడీమేడ్ అన్నాధరువు ఆవకాయే సుమ్మీ.

మన వీరసింహాల ప్రతాపాగ్నికి, కవివృషభుల ఘంటాపటిమకు, మన వేదఘనాపాఠీల తారస్థాయికి మన గాయక శిఖామణుల గంధర్వగానానికి అనాదినుంచీ ఆవకాయే ముఖ్య కారణం !

అగ్నిసాక్షిగ గొన్న అంబుజాక్షిని వీడి
అమెరికా ఆఫ్రికా పరుగెత్తగలడు
ఆవకాయ డబ్బాలు తోడుగా గొంపోవు
ఆవకాయ ఎడబాటు ఆంధ్ర బుల్లోడు క్షణమైన
ఓర్చుకోలేడు !

ఉపరితలే, వస్త్ర కిరీట ధారణం
ముఖే ఘాటు ఘాటు ఘుమఘుమల్,
కంఠే ఊటాతైల మిశ్రమం పుష్కలం
కుక్షే పిండీ ముక్కా స్థిరాసనం,
యావజ్జాడీ నయన మనోహరం
యావదాంధ్రదేశే గృహే గృహే శోభితం.

పిండి మధురం, ముక్కా మధురం, ఊటా మధురం, టెంకా మధురం, చర్మం మధురం, స్మరణం మధురం, పాతది మధురం, కొత్తది మధురం, అడుగూ బొడుగూ అంతా మధురం !

ఆవకాయ ఖావో
అమరత్వం పావో !!



## మహాసముద్రములు ... వైశాల్యము

| | | |
|---|---|---|
| పసిఫిక్ మహాసముద్రము | - | 16,52,41,000 చ. కిమీ |
| అట్లాంటిక్ మహాసముద్రము | - | 8,16,62,000 చ. కిమీ |
| హిందూమహాసముద్రము | - | 7,34,44,000 చ. కిమీ |
| ఆర్కిటిక్ మహాసముద్రము | - | 1,40,90,000 చ. కిమీ |

## రాయలు వర్ణించిన వేసవి (3వ పేజీ తరువాయి)

సౌందర్యాన్నికూడ ఆస్వాదించి సేద తేరుతున్నారు. సేవలకు ప్రతిఫలంగా బాటసారులు ఆ స్త్రీలకు తాంబూలం యిస్తున్నారు. తాంబూలం అంటే అనేకమైన అర్థాలు. ఇంతకు ఆ తాంబూలం, ఎక్కడా వీలు చిక్కక, అక్కడ మకాం పెట్టిన మన్మధుడికి చెల్లించే సుంకంలాగా వుంది అంటాడీ కవి. రసికులు ఏసుంకం ఎగగొట్టినా ఈ సుంకం అడిగి మరీ చెల్లిస్తారుగదా! చలివేంద్రాల నిర్వహణకు, బాటసారులుకూడా యధాశక్తి ధనసహాయం చేసే వారని ఈ సన్నివేశం మనకు తెలుపుతున్నది.

ఎంత ఎండలైనా ధనవంతుల్ని యెప్పుడూ యేమీ చేయలేవు సంపన్న స్త్రీలు, పగలంతా దిగుడు బావులలో జలక్రీడలాడుతూ కాలం గడుపుతున్నారు. రాత్రి కొప్పులలో విరజాజులతో, పలుచటి వస్త్రాలతో, భర్తల కౌగిళ్ళలో పండువెన్నెల బయళ్ళలో సుఖిస్తున్నారు. ఉష్ణతాపం శమించటానికి కొబ్బరి కల్లు కూడ త్రాగుతున్నారు. పురుషులకు స్త్రీల కుచద్వయాలే తాపోపశమనాలయ్యాయి. ఇది రాయల వర్ణన.

“ మాపోదకం వటచ్ఛాయా తాంబూలం
తరుణీ కుచౌ
శీత కాలేథలే దుష్ణ ముష్ణకాలేతు శీతలమ్ ”

అనిగదా. వేసవి వారి యౌవన భోగాలకు అవరోధం కాలేదు.

రాయలు, మధ్యతరగతివారి పాట్లు కూడ, అర్థం చేసుకున్న సుకవి. సామాన్యులకు దిగుడు బావుల వెన్నెల విహారాలు సాధ్యం కావు. అలాంటి భార్యాభర్తల సంగమం దుర్జన కూటమిలాగ వుందట. ముచ్చెమటలు పోస్తుంటే, కౌగలింతలు మాని ముచ్చట్లతోనే, ప్రొద్దు పుచ్చుతున్నారట వారు.

ఇక సంపన్నుల వేసవి భోజనం ఎలా వున్నదో ఆ రోజుల్లో చూడండి

“ తారుణ్యాతిగ, చూత నూత్న ఫల యుక్తై
లాభిఘార, స్వన
ద్ధారా ధూపిత, శుష్యదంబు హృత మాత్స్యచ్ఛేద పాకోద్గతో
ద్గారంపు గనరార్చ్య, భోగులకు, సంధ్యా వేళం
గేళి కాం
తా రాభ్యంతర, వాలుకా స్థిత హిమాంత
ర్నారికేళాంబువుల్ ”

వారు దోరమామిడి ముక్కలు, చేపలు, కలిపి నూనెలో వేయించిన కూరతో భోజనం చేస్తున్నారట. అది జీర్ణం కావటానికి సాయంత్రం చెట్ల నీడల్లో, ఇసుక తిన్నెల్లో పాతిపెట్టబడి నీళ్ళతో తడవబడుతున్న, కొబ్బరి బొండాల, నీరు త్రాగుతున్నారట.

ధనికుల సంగతి యిలా వుంటే ఎరుకల, యానాది సంచార జాతుల పరిస్థితి యెలా వున్నదో కూడ రాయలు వర్ణించాడు. వర్షాకాలం, వారు ఏదో పొలం పనులతో జీవిస్తారు.

వేసవిలో ఆ పనులుండవు. ఎండకు సోలి, చెట్లనుండి జారిపడే పక్షులకోసం వారు నోరు తెరుచుకొని చూస్తున్నారు. అడవులలో నీటి గుంటలు యెండిపోయాయి. పక్షులు నీటకోసం అలమటిస్తున్నాయి. ఎరుకలు అక్కడక్కడా కొన్ని గుంటల్లో నీళ్ళు పోసి సమీపంలో వలలు పన్నుతున్నారు. అడవిపావురాలు నీటికోసంవచ్చి వలల్లో చిక్కుకుంటున్నాయి. ఈ సన్నివేశాలు కూడ రాయల దృష్టి పథం దాటిపోలేదు.

శ్రామిక స్త్రీ లంతా సాయంత్రానికి చెరుకు గానుగల దగ్గరకు చేరుకుంటున్నారు. రెక్కాడితేగాని వారికి తిండి గడవదు. కొప్పులనిండా మల్లెలు తురుముకొని, గుంపులుగా అటూ యిటూ తిరుగుతూన్న వారిని చూస్తుంటే వర్షాకాలంముందు, గడ్డుమోసుకపోతున్న చీమలబారులాగా వున్నారు, అంటాడు రాయలు. శ్రామికులను చీమలతో పోల్చటం సహజ సుందరంగా వుంది.

మిగిలిన ప్రబంధకవులు వుద్యానవనాల్ని, నాయికా నాయకుల పరిష్వంగాల్ని వర్ణిస్తుంటే తాను రాజయి వుండి సమాజంలోని అన్ని తరగతుల ప్రజల వేసవి సంకటాల్ని వర్ణించిన రాయలు ప్రశంసాపాత్రుడు. కవి దిగ్గజాలను పాలించగలిగిన కవి దిగ్గజేంద్రుడు.

“జయన్తితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః” ★

# పుస్తకసమీక్ష

## నారద భక్తి దర్శనం

నారద భక్తిసూత్రాలకు తెలుగు వ్యాఖ్య

రచయిత :

**'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి**

శాంతిసదనం, తాడేపల్లిగూడెం - 534 101

వెల : 25/-

భక్తి అనగానేమి ? భజ్ ధాతువునుండి వ్యుత్పన్నమైన రూపము. భక్తికి రస స్థితి ఉన్నదా ? లాక్షణికులు పెక్కండ్రు భక్తిని రసముని అంగీకరింపరు. అంగీకరించిన వారున్నారు. మధుసూదన సరస్వతుల వారున్నారు. భక్తియే ప్రకృతి రసమని వారి మతము. జ్ఞాన కర్మ భక్తి మార్గములు మోక్షప్రాప్తికి సాధనములే. జగద్గురువులు ఆదిశంకరులు భక్తిని తక్కువగా పరిగణింపలేదు. మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవగరీయసీ " (వివేక చూడామణి) సర్వ మార్గముల యందు భక్తి యొక్కటే సర్వ చరాచర కోటికిని సులభసాధ్యమగు మోక్ష మార్గమని నిశ్చయము.

నారదుడు, శాండిల్యుడు మున్నగు ఋషులున్నారు. వీరు భక్త సూత్రములు రచించిరి. లోకానుగ్రహమునకై రచించిరి లోకకల్యాణమునకై రచించిరి. భారతము వ్రాసిన తరువాత భాగవతమును వ్రాయుటలో వ్యాస భగవానుని దృష్టి యిదియే (భారతము భాగవతములను ఒకే వ్యాసుడు వ్రాయలేదని చెప్పు పండితులకు నమస్కారము)

భక్తి అనగా తాదాత్మ్యము. అందు కలియుట అని భజ్ ధాతువునకు అర్థము. ఎందు కలియుట ? జీవుడు భగవంతుని యందు కలియుట. ఎందుకు గలియవలెను ? వారిద్దరు అసలు ఒకటే కావున కలియ వలయును. ఈ కలియుటకు నవ విధ మార్గములున్నవి. నవ విధ భక్తులున్నారు. నీ వెంత జ్ఞానివైనను భక్తి లేనిచో నీ జీవితము వ్యర్థము. " సంగీతము భక్తి వినా " అని త్యాగరాజస్వామివారు అననే అన్నారు. భక్తి అనగా ప్రేమ భగవంతునియందు ప్రేమయే భక్తి. భగవంతుడు సర్వ వ్యాపకుడు. "సాతు అస్మిన్ పరమ ప్రేమరూపా" అని నారదుని నిర్వచనము. ఉత్కృష్టమైన అనురాగమే భక్తి. ప్రేమ, భక్తి, విశ్వాసము, అనురాగము వంటి పదములకు దైవ భాషయందు గల అర్థము అన్య భాషలలో రానేరదు. ఇది భారతీయుల పుణ్య విశేషము. నారద భక్తి దర్శనం అను గ్రంథము సర్వ మహావిషయ సాగరము, కలిలో దైవము లేడు. భక్తి విశ్వాసములు లేవు. అందరు జ్ఞానులమని భావింతురు. తులసి, కంబడు, తిక్కన, పోతన వీరందరు కవులే. కానీ తమను భక్తులుగానే భావించుకొన్నారు.

నారద భక్తి సూత్రములకు శాంతిశ్రీ జంధ్యాల వెంకటేశ్వరశాస్త్రిగారు అనువాదము చేసిరి. తాత్పర్యము వ్రాసిరి వ్యాఖ్యానము చేసిరి వివిధ మహా గ్రంథముల నుండి గొప్ప విషయములు సమీకరించి సమన్వయించిరి. ప్రస్థాన త్రయము ఆదిశంకరుల రచనలూ, భారత రామాయణ భాగవతములు, తులసి కంబ వాశిష్ఠ రామాయణములు - శ్రీ శాస్త్రిగారిచేత పరిశీలితములు. అగస్త్యుని వలె ఆపోశన పట్టిరి. వారు పొందిన భక్తి తత్వానుభూతిని లోకమునకు అనుగ్రహించిరి భక్తి ఫల స్వరూపిణి, సాధనావరోధిని, వాద వేదన ప్రకరణములలో వీరు ప్రదర్శించిన ప్రజ్ఞను చూడగా, ఆ నారదమహర్షియే వారిని ఆవేశించి వ్రాయించినట్లున్నది.

మనకు షడ్దర్శనములున్నవి ఈ నారద దర్శనము మరియొకటి భక్తి కూడా ఒక దర్శనమే ఆ దర్శనమునకు నారదుడే ప్రథమ ఋషి. అందుచేత ఈ గ్రంథము నామకరణముచేత సార్థకము. శ్రీశాస్త్రిగారు విద్వత్కృష్ఠులు. మహా భక్తులు. ఆంధ్రజాతి శ్రీ శాస్త్రిగారికి నిజంగా ఋణపడి యున్నది. నారద భక్తి దర్శనము చదివి మనము చరితార్థుల మగుదుముగాక, ప్రహ్లాద నారద పరాశర పుండరీక భీష్మ శుక శౌనకాది మహా భక్తులు శాంతిశ్రీగారి జీవలక్షణమును ఆవేశించి యుందురుగాక.

—కాజ లక్ష్మీనరసింహారావు

# కిన్నెర (పాటలు)

## రచయిత్రి : శ్రీమతి డి. సుజాతాదేవి

ప్రతులకు : స్పందన సాహితీ సమాఖ్య
మచిలీపట్నం - 521 001 (లేదా)
శ్రీమతి డి. సుజాతాదేవి
కమలానికుంజ్
అశోక్‌నగర్, విజయవాడ - 520 010

పాట ఎప్పుడు పుట్టిందో చెప్పలేము గాని మౌఖిక సాహిత్యం లిఖిత సాహిత్యం కంటే ముందే పుట్టిందన్నది జగద్విదితసత్యం. ఈ మౌఖిక సాహిత్యంలోని జానపద గేయాలు, మరికొన్ని పాటలు వాటి కర్తృత్వం కంటే వాటిలోని కవిత్వం లోనే బతికి అనోట ఆనోట ప్రవహిస్తూనే ఉండటం విశేషం. డాక్టర్. సి. నారాయణ రెడ్డి గారన్నట్లు " కవిత్వం రాయడం వేరు పాట కట్టడం వేరు. పాట పలకాలంటే రాగహృదయం ఉండాలి. పదాలు ఒక నిర్దిష్టలయలో పడాలి— కుదించి చెప్పే నేర్పు అలవడాలి. " - ఈ లయ, కుదింపులతో పలికిన పాటలే పాడుకోడానికి తేలిగ్గా, కంఠస్థం అవడానికి అనువుగా ఉండి మన నాల్కలమీద స్థిర నివాసం ఏర్పరచుకొంటాయి. పాటనుజయప్రదంచెయ్యాలంటే పై లక్షణాలు తప్పనిసరి.

కథారచయిత్రిగా ప్రసిద్ధురాలయిన డి. సుజాతాదేవి గారు " సమాజం పట్ల, జీవితం పట్ల తన అవగాహనకు 'కథ'ను వాహికగా ఎంచుకొంటె ప్రకృతిలోని పరమాద్భుత సౌందర్యాలు, మనుషుల మధ్యనుండే మధురమైన బంధాలు, చల్లటి స్నేహాలు, కలలు, ప్రేమలు, విరహాలు, విరాళలు లాంటి సుతిమెత్తని భావాలు పలకటానికి " పాట" ను వాహికగా ఎంచుకొన్నారు. " కిన్నెర " అనే ఈ పాటల సంపుటిని " విజయవంతంగా " వెలువరించారు.

పాటకు పల్లవి ప్రాణం. పేజీలు తెరవగానే మొదటి పాటలోని పల్లవి " పాడమన్నది/పాడమన్నది/మనసు నిండి తొణికే ఓ/ మధుర మధుర భావగీతి " — మనల్ని ఆకర్షించి సంపుటిలోని ఇతర పాటల్ని కూడా పాడమంటుంది. ఈ మొదటి పాటలోని లోతైన భావాలు సైతం సున్నితంగా, శృతిసుఖంగా రమణీయంగా మనల్ని డోలలూగిస్తాయి.

" ఎవరు చెప్పగలరు ఈ అందాలు/ ఎవరు విప్పగలరు ఈ/ విశ్వ రహస్యాలు " — అంటూ విశ్వ రహస్యాన్ని ఓ పాటలో పట్టియిచ్చారు. ప్రకృతి దృశ్యాన్ని చక్కగా మనకు దృశ్య మానం చెయ్యడం ఈ రచయిత్రి విశేష లక్షణం.

" కదిలే నది అదిగో అట
సుందర సిందూరం
గగన కాంత సవరించే
చీర చెరగు సింగారం " —...

అలాగే—

జీవితంలోని వివిధ దశల్లోని అనుభూతుల మాల " స్మృతిగీత ". అది వివిధానుభూతుల నెమరువేత. ఈ అనుభూతులు వైయకిక్తమైనా, వైయక్తికం కాకుండా తేలిగ్గా మనకి అందే, మనం పొందే అనుభూతులకు సామ్యమైనవి. అందులో చెదరిన స్వప్నాలూ, అందిన స్వర్గాలూ రెండూ ఉన్నాయి. ఇందులోనే ఒక చోట " ఊపిరి కుట్టల్లె దిగులు - ఉరకలేని కన్నీళ్ళు " — ఊపిరికుట్టల్లే దిగులు — ఈ దిగులు అనుభవ సాధ్యమైంది. ఊపిరికుట్టు ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో గుచ్చినట్లుగా ఉంటుంది. దిగులు గలవాడికి అది అనుక్షణం జ్ఞప్తికి వచ్చి గుచ్చుకుంటుంది. మరింత బాధపెడుతూఉంటుంది. ఇది మంచి రమణీయ భావన.

ఇంకా ఇందులో ఉగాదికి స్వాగతాలు, ఇంకా ఎన్నెన్నో అనుభూతుల గురుతుల మౌనగీతాలు మధుర భక్తిపూర్వక ఆరాధనా గీతాలు, బాలకృష్ణుని బాల్య చేష్టలూ అన్నీ " కిన్నెర " మీటితే మన హృదయాన్ని తాకి చిలకలా, చిలకల కొలికలా, వెన్నెలలా మనల్ని అలరిస్తాయి.

స్పందన సాహితీ సమాఖ్య వారు తమ 51వ ప్రచురణగా మంచి గెటప్‌లో వెలువరించిన ఈ మంచిపాటల పుస్తకం కొనియాడదగినది - కొని - పాడదగినది - పాడించుకు వినదగినది—

—జోరాశర్మ

## "శ్రీ వాణి" జీవిత సభ్యులు



శ్రీ కొత్త సుబ్బారావు, స్వరాజ్యలక్ష్మి
సర్వోదయ పబ్లిషర్స్, బుక్ ఎంటర్‌ప్రైజెస్
సాయి సదన్, పుట్టపర్తి



YELLA JOSYULA VENKATESWARLU
Salesman
Brooke Bond India Limited
NUZIVID

# దేశసేవయే దైవసేవ — శ్రీ స్వామిరామతీర్థ

దేశ సేవయే దైవ సేవ. అదే అనుష్ఠాన వేదాంతమని నమ్ము. నీవు ఒక దేశ సేవకుడివి కావాలని కోరుతున్నావా, నీ హృదయాన్ని ఈ దేశ ప్రజల ప్రేమతో శ్రుతి కలుపు. నీవూ వారూ ఒకటే ననుకో. నీకూ వారికీ మధ్య ఒక సన్నటి పొర గూడా అడ్డం లేదనుకో! జాతి కొఱకు ప్రాణత్యాగం చేసిన ఒక ఆధ్యాత్మిక సైనికుడివి కా! ఈ విధముగా నీవు భావించు. సకల జాతి నీతో భావిస్తుంది.

ఈ భారతభూమి నా శరీరం. కన్యాకుమారి అగ్రం నా పాదయుగళం. హిమాలయాలు నా శిరస్సు. నా జటల్లోంచి గంగ ప్రవహిస్తున్నది. నా శిరస్సునుంచి బ్రహ్మపుత్ర ప్రవహిస్తున్నది. సింధునది పొంగుతున్నది. వింధ్యాచలాలు నా కటీ మండల మేఖల. కోరమాండల్ తీరము నా కుడికాలు. మలబారు నా ఎడమకాలు. నేను భారత సర్వస్వాన్ని. భారతదేశంయొక్క తూర్పు పడమర దిక్కులే నా మహాచేతులు. సకల మానవ ప్రపంచాన్ని ఆలింగనం చేసుకోవడానికి దిక్కులనే యీ చేతులను నేను చాచాను. నా ప్రేమ సర్వ విశ్వాన్ని ఆవరించింది. ఇది నా విశ్వరూపం. అనంతమైన ఆకాశంలో నిలబడి నా విశ్వరూపాన్ని ప్రపంచానికి ప్రదర్శిస్తాను. నేను నడిస్తే సర్వ భారతం నడిచినట్లుంటుంది. నేను మాట్లాడితే అఖండ భారతం మాట్లాడినట్లుంటుంది. నేను గాలి పీలిస్తే మహాభారతం గాలి పీలుస్తుంది. నేను అఖండ హిందూస్థానాన్ని. నేను శంకరుణ్ణి. నేను పరమశివుణ్ణి. ఇదే దేశభక్తియొక్క సిద్ధస్థితి. ఇదే అనుష్ఠాన వేదాంతం.

ఇతర దేశాలలో భగవంతుణ్ణి తండ్రిగా అర్చిస్తారు. భారత్‌లో భగవంతుడు తండ్రిగానే కాకుండా, తల్లిగా గూడా అర్చింపబడుతాడు. 'మాత' అనే పదం భారత వాఙ్మయంలో అతి పవిత్రమైనది. హిందువుడు జబ్బుతో భరించలేని బాధపడుతున్నప్పుడు, అతని నోటవెంట 'హే భగవంతుడా!' అని కాదు వచ్చేది. "అమ్మా! .... అమ్మా!" అని వస్తుంది. ప్రతి హిందువుని హృదయాంతరాల్లో నుండి వినిపిస్తుంది అమ్మా అనే శబ్దం. ప్రతి హిందువుని హృదయంలో గాఢోద్వేగాన్ని కలిగిస్తుంది అమ్మ అనే మాట. 'అమ్మ' అనే రెండు అక్షరాలలోనే యిమిడి వున్నది కమ్మని కథ. అమ్మ లేని జీవితం చుక్కాని లేని పడవతో సమానం. జన్మనిచ్చిన అమ్మను సృష్టి నిచ్చిన దైవంతో సమానంగా భావిస్తారు ఇచటి ప్రతి హిందువు.

భారతదేశంలో స్త్రీకి అత్యున్నతమైన గౌరవస్థానం వున్నది. ఇచట పురుషుడు తన భార్యను 'నా భార్య' అని పిలవడానికి సాహసించడు. భార్యను గురించి చెప్పవలసి వచ్చినప్పుడు "మా పిల్లవాడి తల్లి, మా కృష్ణుడి తల్లి, మా రాముడి తల్లి" అని చెబుతాడు. ★

# స్వీకారం

"ప్రభవ" వెల : అమూల్యం
(కవితా సంకలనం)
సంపాదకత్వం : శ్రీ టి శ్రీరంగస్వామి
ప్రతులకు : శ్రీలేఖ సాహితి
5-11-114/4, విద్యారణ్యపురి
వరంగల్లు - 506 009

"హృదయనాదం" వెల : రు. 4-00
(వచన కవితా సంపుటి)
సంకలనకర్త : శ్రీ నవ్వప్పగారి ఈరన్న
ప్రతులకు : కమలా కళానికేతన్
వై యం కె. హైస్కూలు
ఆదోని - 581 301

"ప్రసంగతరంగిణి" వెల : రు. 15/-
రచన : శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
ప్రతులకు : కళాప్రపూర్ణ మధునాపంతుల
సత్యనారాయణశాస్త్రి
లలితానగర్, రాజమండ్రి-1

"వందేమాతరమ్" వెల : రు. 7-00
రచన : శ్రీ తాళ్ళూరి సత్యనారాయణ
ప్రతులకు : శ్రీ మేకా రామకృష్ణయ్య
కూచిపూడి - 522 213, గుంటూరు జిల్లా

"రసవద్ఘట్టాలు" వెల : రు. 15-00
రచన : శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి
ప్రతులకు : శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి
1/74-ఎ, గాంధీనగర్
కడప - 516 004

"హరిజనులు, వారి పుట్టుపూర్వోత్తరాలు"
వెల : రు. 10-00
రచన : శ్రీ గోవాడ నిరీక్షణరావు
ప్రతులకు : శ్రీ గోవాడ నిరీక్షణరావు
భాగ్యనగర్ ప్రచురణలు
మచిలీపట్నం - 521 001

"గెలుపు" కథలు వెల : రు. 12-00
రచన : శ్రీమతి డి. సుజాతాదేవి
ప్రతులకు : శ్రీమతి డి. సుజాతాదేవి
అశోక్‌నగర్, మొదటి లైన్
విజయవాడ - 520 010

Postal Registered
No. H/MPM/34, Dt. 10-12-84

SREE VANI

Regd. with Registrar of News Papers
No. RN 000121/20/AL/85 NT III